అక్టోబరు, 1959

# జయంతి

## 12

సంపుటము 1 సంచిక 12

ఈ సంచికలో

ఆధునిక సాహిత్యగతిని సూచించే

*హిందీ మాసపత్రిక :*

# 'కల్పన'

నవ్య కవితా రీతులు

కథలు

సాహిత్య విమర్శలు

ఆధునిక సాహిత్య సమస్యలపై

విశేష చర్చలు.

కార్యాలయము :

౩౧౭, సుల్తాన్‌బజార్

హైదరాబాద్.

# జయంతి

## 12

జయంతి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః.




సంపాదక కార్యాలయము
ఉస్మాన్‌పురా, కరీంనగరము

★

ప్రచురణ కార్యాలయము
516, సుల్తాన్ బజార్,
హైదరాబాదు.

★

పనిఆర్డర్లు ప్రచురణ కార్యాలయమునకే
పంపవలయును.

సంవత్సర చందా 8-00
విడిప్రతి 75 న. పై.

# సంపాదకీయము

కవి తన బ్రతికియున్న కాలమును తన రచనలలో ప్రతిబింబింపజేయవలయునన్న సిద్ధాంతము నేడు పలుమందిని పట్టుకొని బాధించుచున్నది. ఎవరిని పట్టుకొన్నదో వారిని బాధించినచో నష్టములేదు. కాని ఇతరకవులను బాధించుచున్నది. ఈసిద్ధాంతము ఇతరములైన మరికొన్ని సిద్ధాంతములవలె దేశీయమైనదికాదు. జాతీయమైనదికాదు. మన పూర్వ లాక్షణిక గ్రంథములలో కావ్యము జీవితమునకు ప్రతిబింబముగా వర్ణింపబడినది కాని కవి తాను బ్రతికియున్న కాలములోని సాంఘికాది జీవితము ప్రతిబింబించి తీరవలయునన్న నిబంధన ఎచ్చటను కన్పించదు. షేక్స్పియర్ మొదలైన కవుల గ్రంథములు పాఠ్యములుగానైన సమయములలో నీ సిద్ధాంతము కొంత కొంత తద్వ్యాఖ్యాతలు వ్యాఖ్యాముఖముగా వ్రాసినవానిని గురించి మన వాం గ్రేర్పరచుకొన్నది.

నేటి కొందరు విమర్శకులు వాల్మీకి, తులసీదాసు మొదలైన మహాకవుల యందు నీ సిద్ధాంతమున్నదని వ్రాయుచున్నారు. వాల్మీకియం దీ సిద్ధాంత మెట్లున్నదో మనకు తెలియదు. వాల్మీకి యే కాలమువాడో తెలియదు. ఆధునికులు క్రీ. పూ. 2000 యేండ్లవాడని చెప్పుదురు. మనదేశములోని సంప్రదాయము కృతయుగమువాడని, అనగా నలుబదిలక్షలసంవత్సరములకుపై వాడు కావచ్చును. ఆయన యొక్క కాలనిర్ణయము చేయుటకు వీలులేదు. 'కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్' అన్న వాక్యమునకు అర్థము ఆ కాలములో జనులు గాఢశీలములేనివారనియు నట్టి వా డుండుట యరుదనియు, నందుచేత నట్టివానిని వాల్మీకి నిరూపించెననియు వ్యాఖ్యానించినచో మరియు యే యితరకాలమునందు నట్టివారు లేరనియే చెప్పవలెను. హరిశ్చంద్ర కథలో ధరణీతలమునందు నిజము మాటాడువాడెవడని యింద్రుడడిగినట్లు మొదలైన కథ యున్నది. ఆ హరిశ్చంద్ర కథ వ్రాసినవాడు కూడ తన కాలమును ప్రతిబింబించుటకు వ్రాసెననవలయునా ? ఆ ప్రశ్న అప్పుడు నిప్పుడు నెప్పుడు నున్నది.' వారు వేదధర్మమును ప్రపంచించుటకు కావ్యములు వ్రాసిరి. వేదధర్మ మనగా సనాతనధర్మము, నిత్యధర్మము. ఇదియే మన సర్వ పూర్వకవులకు కావ్యవస్తువు. 'కావ్యమ్ యశసే' మొదలైన దండిసూత్రములో 'వ్యవహారవిదే' యని కూడ నున్నది. లోకవ్యవహారము సర్వదా కావ్యమునందు ప్రతిబింబించుచునే యుండును. అది అన్నమువంటిది. తక్కినవన్నియు వ్యంజనములు. వట్టిఅన్న మెవ్వడు బొక్కలేడు. కావ్యములో గుణములు, శైలి, రీతి, అలంకారములు వ్యంగ్యములు ప్రధానములు కాని తన కాలమును ప్రతిబింబించెనా ? లేదా ? అన్నది అప్రధానము, అది అపసిద్ధాంతము. ఈ సిద్ధాంతమును నేడు కొందరు తమకు గల యేదో సిద్ధాంతమును ప్రచారముచేయుటకు ఇతరులను ప్రతారించుటకో తమ కిష్టములేని కవులను దూషించుటకో యుపయోగించుచున్నారు. కాని ఈ సిద్ధాంతమునందు బలములేదు.

కాదిసిద్ధాంతమునందు బలమున్నదని యంగీకరింతము. పూర్వకాలములమాట ఎందుకు? నేటి కాలమునే తీసికొందము. నేటి కాలమనగానేమి ? నేటి కవి దేనిని తన కావ్యమునందు ప్రతిబింబింపవలయును ? ఇతర దేశముల మాట యట్టిపెట్టి భారత దేశమును తీసికొందము. భారతదేశములో నేడు బహుసిద్ధాంతములు కలవు. రాజకీయపక్షములున్నవి. వానికి చెందిన వారున్నారు. మొదటి రాజకీయ పక్షము కాంగ్రెసువారు. వారి పరిపాలనా విధానముతో మనకు సంబంధములేదు. వారి లక్ష్యములతో సంబంధము. వారి ప్రధానమైన లక్ష్యము గాంధిగారు. ఆయన జీవితము, ఆయన అహింసా సిద్ధాంతము వారికి ప్రధానమైనవి. అహింసా సిద్ధాంతమునుగూర్చి వ్రాసినచో నేటి కాలమును ప్రతిబింబించినట్లేయగునా ? అందు కనియే కావచ్చును కొందరు కవులు బుద్ధుని

జీవితములోని కథలను తీసికొని వ్రాయుచున్నారు. ఇట్లయినచో నాగానందము నేటి నాటకము కావలయును. కథా సరిత్సాగరములోని కొన్ని కథలు నేటివి కావలయును. జాతక కథలన్నియు పద్యములలో పెట్టవలయును. ఆ పని ఎవ్వరును చేయుచున్నట్లు లేదు, గాంధీగారి జీవితము బ్రహ్మాండముగా మహాకావ్యముగా నిర్మించవలయునని గొప్ప గొప్ప రాజకీయ నాయకులు తాము కలిసిన ప్రతి కవితోచెప్పుచుందురు. ఏకవియు వ్రాసినట్లు కన్పించదు. ఒక తెలుగుకవి మాత్రము ఆత్మకథను తెలుగుచేసెను. అది స్వతంత్రకావ్యము కాదు. ఆకావ్యము నెంతమంది చదువుచున్నారో తెలియదు. ప్రస్తుతకాలమును ప్రతిబింబించవలయునను వస్తువును పట్టుకొని ఊగులాడువారు, తత్కావ్యమును శిరసావహించుచునట్లుకన్పించదు. తెలుగుదేశమునందేకాదు. భారతదేశము నందున్న తక్కిన భాషా ప్రదేశముల యందు కూడ గాంధీగారి జీవితము నందలి ప్రధానఘట్టములను మహాకావ్యముగా నిర్మించి ప్రశస్తి కెక్కిన వారెవ్వరు కన్పించుటలేదు.

ఇక ఖండకావ్యముల మాట విచారించినచో ఖండకావ్యములలోని వస్తువిదియని చెప్పుటకు వీలులేదు. అనేక వస్తువులలో నది యొకటి. ప్రస్తుత కాలమునకు సంబంధించిన వస్తువులను తీసికొని చిన్న చిన్న ఖండకావ్యములు వ్రాసినవారు పెక్కుమంది కలరు. పెక్కుమంది యనుటకన్న నేడు తెలుగు భాషలో ప్రసిద్ధులైన సర్వకవులు ఆపని చేసిరనియే చెప్పవలయును. ఎవరోకొందరు కవులు సనాతన వాదులని దుష్ప్రచారము చేయింపించుకొన్న కవులు కూడ నేటి కాల పరిస్థితులను ఖండకావ్యములందు వ్రాసినారు. వ్యంగ్యముగా నొకటి రెండు పెద్దకావ్యములే వ్రాసినారు.

రెండవ సిద్ధాంతము మరియు క్రొత్త సిద్ధాంతము. భూదానోద్యమము. ఈ ఉద్యమవాదులు కూడ ప్రచారశక్తి కలవారే. ఈ నడుమ కాశ్మీరము నందలి శ్రీనగరమున దేశమునందలి సుప్రసిద్ధ కవులందరిని పిలిచి భూదానోద్యమమును గురించి ఏ యే భాషలలో ఎంత మంది కవులు కావ్యములు వ్రాసిరి ? దానికి ప్రచారము కలిగించుట యెట్లు ? కవులీ భూదాన వస్తువును గ్రహించి కావ్యములు వ్రాయునట్లు చేయుట ఎట్లు ? మొదలైన విషయములు విచారించుటకు గాను పెద్దసమావేశము జరుగనున్నదని విన్నాము. జరిగినదో లేదో తెలియదు. ఈ భూదానోద్యమమునుగూర్చి కొందరు కథలు వ్రాసినవారున్నారు. పద్యాలు వ్రాసినవా రెక్కువమంది లేనట్లున్నది. అందుచేత నేడున్న యితరకవులందరికంటె భూదానోద్యమమును గురించి కథ వ్రాసినవాడు మహారచయిత యని చెప్పవలయునా ? అహింసా సిద్ధాంతమును గురించి పద్యము వ్రాసినవాడు మహాకవియని చెప్పవలయునా ?

మూడవది సామ్యవాదము. ఈ సామ్యవాదులు పూర్వపు రెండుపక్షముల వారికంటె తీవ్రప్రకృతులు. తీవ్రప్రకృతికి సామ్యవాదమున కెక్కువ సంబంధమైనట్లు కన్పించుచున్నది. వారు చెడుగుడిలో నిపుణులు. కవ్వించ నేర్చినవారు. ఆకలి, వర్ణవ్యవస్థ పోవుట, సర్వజనులు సమానము, ఆర్థిక సామ్యము, పరదేశానుకరణము, విపక్ష నాశనము మొదలైన బహుసిద్ధాంతములు వారికి కలవు. వానిని గురించి వ్రాసినదే వారికి కవిత్వ మనిపించును. అదియే క్రొత్త కవిత్వము. తక్కినదంతయు ప్రాత కవిత్వము. ఈనాటి జనులు ప్రాత కవిత్వమని దేనిని నిందించుచున్నారనగా మన శాస్త్రములు, పురాణములు, వేదములు, ధర్మములు మొదలైనవానిని గురించి వ్రాయబడిన సర్వకవిత్వము ప్రాతకవిత్వమని. రామాయణము, ఇంగ్లీషు భాషలోకి తర్జుమా చేయబడినది. ఉపనిషత్తులు ఇంగ్లీషు భాషలోనికి తర్జుమా చేయబడినవి. వేదములే ఇంగ్లీషులోనికి తర్జుమా చేయబడినవి. పాశ్చాత్య దేశములలోనే వీనిని చదివి భారతదేశ

నాగరకతా మహోత్కృష్టతను భావించువారు కలరు. భారత రామాయణములు రష్యాదేశపు భాషలోనికి తర్జుమాచేయబడుచున్నవని విన్నాము. అంతేకాదు. ఆ దేశపు సిద్ధాంతములు తలకెక్కి ఇచ్చట వెడదిరిగినవారు, మనదేశపు సిద్ధాంతములు తలకెక్కిన యా దేశముల వంక తిరిగి ఎందుకు చూడరు? ఇప్పుడు మనకు దానితో ప్రసక్తి లేదు.

ఈ క్రొత్తకవిత్వము వ్రాసెడివారు దేశములో నెంతమంది కలరు? వారిలో ప్రసిద్ధు లెంతమంది కలరు? ఒక గడియారము శేషశాస్త్రిగారు, మధునాపంతులవారు, దేవులపల్లి వారు, తుమ్మల వారు వీరికివచ్చినంత ప్రశస్తి ఈ క్రొత్తకవిత్వము వ్రాసెడివారికి వచ్చినదా? వ్రాసిన వారికి వచ్చుట లేదు. ప్రశస్తి వచ్చినవారిని కొందరిని బట్టుకొని వారు మా సిద్ధాంతమునకు చెందినవారేనని చెప్పి కొనుట వేరు.

కొందరు గోడమీది పిల్లివాటపు కవులు. వారుద్యోగములు సంపాదించుటలో నెంత నేర్పు చూపింతురో కవిత్వము వ్రాయుటలో కూడ నంత నేర్పు చూపింతురు. వారాధునికభావములను గూర్చి వ్రాసిరో లేదో మనము చెప్పలేము. వారును చెప్పలేరు. కాని వ్యాఖ్యానము చేయువారు వారి పక్షమునందు కలరు. కవులలో కొంద రదృష్టవంతులు.

పైన చెప్పినవి కాక మరియు కొన్ని రాజకీయ పక్షములు కలవు. మరియొక క్రొత్తపక్షము నిన్ననో మొన్ననో వెలసినది. ఇదికాక రైతుఉద్యమ మని యింకొకటి కలదు. అదియు మరియు నేడు కొంత ప్రాతబడినట్లు కన్పించుచున్నది. ఓ విమర్శ సిద్ధాంతి శిరోమణులారా! వీనిలో దేనిని గురించి వ్రాసినచో ఆధునిక కవిత్వమో చెప్పవలయును.

మనుజులలో మూడు రకములైనవారుందురని చెప్పవచ్చును. ఒకరు రాజ్యములు చేయవలయు నని యెంచెడివారు. రెండవవారు సామర్థ్యము లేక వారికి సహాయ పడెడివారు. మూడవ రకమువారు నిస్సహాయులు, లోకములోని కష్టములన్నియు వారివి. పన్నులు వారిమీద పడును. వారెవరిచేతను పనులు చేయించుకొనలేరు. కష్టములు వచ్చినచో ననుభవింతురు. ఇతరులు తమ్ము దోచికొనినచో, నిందించినచో, బాధలను పెట్టినచో మన కర్మమింతేయని యూరకుందురు. ధాత్రిలోనున్న సర్వకష్టము లీ మూడవ రకము వారివే. మొదటి రెండురకములవారు కాలమును చేయుదురు. వారు కాలపురుషులు, సిద్ధాంతములు వారివి.

ఈ మూడవ రకములో నున్నవారు కూడ బ్రతుకుచున్నారుకదా! వారికిని పెండ్లము బిడ్డలు కలరుకదా! వారును కలియో గంజియో త్రావుదురుకదా! వారికి రాజకీయ సిద్ధాంతములు లేవు గాని తక్కిన సిద్ధాంతములు లక్షలున్నవి. ఒకడు బ్రహ్మసమాజ మతస్థుడు, ఒకడు రాధాస్వామి మతస్థుడు. ఒకడు నాస్తికుడు. ఒకడు రామకృష్ణ మతమువాడు. ఒకడు సాయిబాబా అనుయాయి. మరియొకడు కంచి కామకోటి పీఠాధిపతిభక్తుడు. ఇట్లు రాజకీయములలో నెన్ని విభేదములు కలవో అన్నిటికంటె పదిరెట్లు భేదములు పారలౌకిక భావవిషయికములు కలవు. వీరందరు మనుష్యులే కారా? వారి సిద్ధాంతములు ప్రతిబింబించుచు కావ్యములు వ్రాసినచో నాధునిక జీవనమును ప్రతిబింబింపచేసినట్లు కాదా! పూర్వ మెంతయో గొప్ప రచయిత తాజా క్రొత్త రచయిత యని యనుకొన్న యాయన నేడు రమణమహర్షి యాశ్రమములో నున్నాడట. ఇవి ఒకదాని కొకటి పొసగించుకొనుటకు కష్టమైనవిషయములు.

ఒక్కొక్కనికి ఒక్కొక్క సిద్ధాంతము, ఆ సిద్ధాంతమునందున్న వాని తీవ్రతకొలది వాడు తన సిద్ధాంతమే సిద్ధాంతమని పెద్ద హంగామా చేయుచుండును. ఈ హంగామాలో మరియొక రహస్య మున్నది. ఆధునిక కాలము చాల చమత్కారమైనది. కవితాశక్తినిబట్టి వీడు గొప్ప

వాడని కాదు. వాని యనుయాయుల బలాబలములను బట్టి వాడు గొప్పవాడు. ప్రతి కవికి కొందరు మిత్రులు, కొందర మిత్రులు. కొందరి విషయములో నమిత్రులసంఖ్య యెక్కువ కావచ్చును. ఆ కవి గ్రంథము విమర్శించినచో, ఆ మిత్రులందరు చేరి పదిదినములు పెద్ద అలజడి చేయుదురు. ఆవైపు సూర్యు డీవైపు పొడిచినట్లు పెద్ద హడావిడి చేయుదురు. ఒక కవి గ్రంథము బాగున్నదని వాని మిత్రులు ప్రశంసింతురు. వారి యమిత్రులు మొగము మొరకటించుకొందురు. కొంపకూలిపోయినట్లు డిల్లబడుదురు. నేటి తెలుగు దేశపు స్థితి యిట్లున్నది. పరోక్షమునందు తిట్టుదురు. మొగముముందు ప్రశంసింతురు.

ఒక రహస్యము చెప్పవలయును. గొప్పకవియని అనుకొనబడుచున్న వాడొకడు కలడు. వానిసిద్ధాంతములు మనకిష్టముకావు. వానిని మనము గొప్ప కవియని యనుచున్నాము. ప్రతిభాశాలి యనుచున్నాము. వాని కావ్యమునం దవిలే వివిలేవని వ్రాయుచున్నాము. అనగా మనమనుకొన్నవి లేవనియేకదా! అవి లేకపోయినను వాడు గొప్ప కవియని మనమంగీకరించుచున్నాము కదా! నీ మనస్సును నీవే విమర్శించి చూచుకొనుము. వాడుకవి. నీ సిద్ధాంతములు లేవు. అనగా కవిత్వమునకు సిద్ధాంతమునకు సంబంధములేదనియేకదా అర్థము. ఆ సిద్ధాంతములు వ్రాసిననే కవియైనచో వాడు కవి కాకూడదు. వాడు కవియని నీవంగీకరించుచున్నావుకదా! కనుక నీ ప్రకారము కూడ నీ మనస్సును సూక్ష్మముగా విచారించి, విభజించి కొన్నచో సిద్ధాంతములకు కవిత్వమునకు సంబంధములేదు.

కవిత్వమనునది వాగ్వైచిత్రి, వ్యంగ్యవైభవము, వక్రోక్తి నైపుణ్యము, అలంకారసంగ్రహణ దక్షత, ఔచిత్య వేతృత్వము, రససంధాన నైపుణ్యము, రచనాశిల్ప సామర్థ్యము-వీనినాశ్రయించి యుండును. తక్కినవాని నాశ్రయించియుండదు, ఉన్నచో షేక్స్పియర్ మొదలైన కవులు భారతీయులకు కవులు కాకూడదు. కాళిదాసాదులు పాశ్చాత్యులకు కవులు కాకూడదు. వారి సిద్ధాంతములు వేరు. వీరి సిద్ధాంతములు వేరు. వారి సంప్రదాయము వేరు. వీరి సంప్రదాయము వేరు. వారిమతము వేరు. వీరి మతము వేరు. కాళిదాసాదులు మహాకవులని పాశ్చాత్యు లంగీకరించుచున్నారు. షేక్స్పియర్ మొదలైనవారు మహాకవులని భారతీయు లంగీకరించుచున్నారు. కవిత్వమనునది సిద్ధాంత మత రాజకీయ సాంఘిక సంస్కార ప్రభృతములైన బహువిషయములకు దాటినవిషయము. మహాకవియందున్న కవితాశక్తి పరమేశ్వరాంశ.

నాయని సుబ్బారావు

# వేదనావాసుదేవము

ప్రణతార్తి భంజనుఁడవని
గణేయులగువారు పొగడఁగా ముగ్ధుఁడనై
గుణహీను నిన్ను విడువక
గుణింతు నిదియేమి బావుకొనో తెలియఁ.

గుణముల్ మూఁడిటి నిచ్చవచ్చినగతిఁ గుప్పించినఁ సర్వ దు
ర్గుణ కందమ్ముగ తీర్చిదిద్ద నిది నీకుఁ వేడుకౌనోటు : ష
డ్గుణ తుంగాచ్ఛ తరంగరంగ విలసత్కూలంకషా : నన్నిటుల్
గణనాతీత మహౌఘ పుంజమునకుఁ గావింతువే : పాత్రముఁ.

ఇది చేయందగనట్టి కార్యమని లో నేధర్మమో మూల్గనై
యిదియే చేయుచునుందు నెల్లపు దధర్మేచ్ఛాదృత మ్మంత బో
కిది నీపన్నిన మాయయంచు నొక సాహిత్యమ్ము సంధింతునే
నిది లోకోత్తరమైన భక్తిగదె : ప్రహ్వీభూత మాయావధీ :

మాయలమారి పోకడల మంచెద విజ్ఞనియెల్ల ముండ్లకం
పై యెటులీడ్చినన్ తఱుగనట్లుగ విన్ని యుగమ్ములయ్యు నా
ప్యాయత నన్ను నాకు తెలుపంబనిలేని తటస్థవేష ధౌ
రేయ మికెంతకాలము వరించెదవో యది నేను చూచెదఁ :

యమ నియమాది సాధనములంటవు నేంద్రియ చిత్తవృత్తి మో
క్ష మహిత బోధవల్లరులు సాగ వొకంగుళమేవి కాని ప్రా
ణములివి వేదశాఖల కొనల్ ఫలియించిన నీ స్వరూపముఁ
గమిచికొనంగనే పొరలగాబడు : దీనికి ప్వస్తి యెన్నడో :

నను నెట్లుం గడతేర్పజాలని భవన్నాథత్వమేపాటి ! నా
మనసిట్లూరక దుఃఖవహ్ని మరగింపఁ వేమమా నీకు ! పే
నును కుక్కించెదనన్న భూరి బలవంతుండేగదా రాజు రా
జును చెక్కింపగలేచె పేనను కథా సూక్ష్మమ్ము గుర్తుంచుకో !

నన్నేదో వెలిగింపు పౌరుషమనిఁ దైవమ్మ నాపైననే
నున్నానంచని చెప్పి తప్పుకొను నుద్యోగమ్మికంజెల్ల దా
పన్నిత్యాశనిపాత భీతి జనితాపస్మారమై నా కవ
చ్ఛిన్నమ్మయ్యెను పౌరుషమ్మిక నవిచ్ఛిన్నమ్ము నీదైవమే !

అణుగర్భమ్మున పీటవెట్టుక సుసూక్ష్మ ! చర్వణాసాధ్య చి
క్కణమై పోతివి నాకు భౌతిక మహాజ్ఞానప్రభాధీమద
గ్రణు లీసృష్టి రహస్య భేదన కళాకాముల్ నినుం గానక
య్యణు గర్భమ్మును వ్రక్కలింతు రికనయ్యా ! నీకు తావేదనో !

కుజగోళమ్ములు చంద్రగోళములు నీకుంగానివై నేటి క
క్కజపుఁ రీతుల విక్రమింతు రణుసంజ్ఞావేదు లీనేల తో
యజ మిత్రాంతర భేదన ప్రతిభ నీయంతేను గన్గో ననం
త జగన్నాటక సూత్రధారి ! యపుడైన న్నన్ను గుర్తింతువో !

విశ్వనాథ సత్యనారాయణ

# అభిజ్ఞాన శాకుంతలము

## 11

ఈ విమర్శనము శాకుంతలమునందలి కాళిదాసుని శిల్పము దేనిచుట్టు తిరిగినదో ఆ సత్పదార్థము దుష్యంతునియం దెట్లు నిరూపింపబడినదో తదేక వ్యాఖ్యానము. ప్రాస్తావికముగా నితర విషయములు కొన్ని ముచ్చటింపబడినను ప్రధానముగా నిది సద్వ్యాఖ్య. తదితరములైన విషయములు చెప్పుటకు సంకల్పించనేలేదు. ఈ సద్విషయిక వ్యాఖ్య పూర్వ వ్యాసము తోడనే పూర్తియైనది. కాని దానిలోని భాగము కాదన్నట్లుండి దానిలోని భాగమైన యొక విషయము మిగిలినది. ఆ విషయము శాకుంతలము నందలి విదూషకుడు.

ఈ విదూషకుని సృష్టి విలక్షణముగా నున్నది. ఇతడు దుష్యంతునియొక్క ద్వైధీభూతమైన మనస్సులో నొక యంశ. మనస్సుకంటె భిన్నమైన యంతఃకరణమునకు దుష్యంతుడు లక్ష్యముగా, మనస్సునకు విదూషకుడు లక్ష్యముగా నీ నాటకమును కాళిదాసు నిర్మించినట్లు కనబడుచున్నది. మనస్సు చంచలమైనది. తదితరమైన యంతఃకరణము చంచలమైనదికాదు. ఈ నాటకమునందు ప్రధానమైనది శృంగారరసము. శృంగారరస సంబంధమైన మనశ్చాంచల్యమునకు విదూషకుడు లక్ష్యభూతుడుగా నిర్మింపబడినట్లు కనిపించుచున్నది. దుష్యంతుని కామము ధర్మకామము. కాని అతడు బహుభార్యాకుడు. దక్షిణనాయకుడు. ఎంత ధర్మకామమైనను దక్షిణనాయక గత శృంగారము చెరపుచుండును. ఈ నాటకమునందు వసుమతి, హంసపదిక వీరిద్దరు కనిపించుచున్నారు. మూడవది శకుంతల. ఈ ముప్వురు నాయికల మధ్య దుష్యంతునియొక్క శృంగారభావము విభజింపబడుచున్నది. విదూషకుడు దుష్యంతుని మనస్సునకు పతాకగా నున్నాడనగా నా మనస్సుకూడ ధర్మానుబంధియై దానికున్న చాంచల్యము ముప్వురి భార్యల నడుమ సంచరించుచున్న దుష్యంతుని మనస్సును ప్రతిబింబించుట.

ఇది యేడంకముల నాటకము. శృంగారరస ప్రధానమైన నాటకము. నాల్గవ యంకము మినహాయించినచో తక్కిన సర్వాంకములయందు రాజుయొక్క శృంగారలక్షణ మున్నది. న్యాయముగానీ యారంకములయందు విదూషకు డుండవలయును. అట్లు లేదు. ప్రథమ సమాగమమునందు లేడు. ప్రధానమైన పునస్సమాగమమునందు లేడు. పంచమాంకమునందు మొదటి పదిమాటలకు తప్పలేదు. షష్ఠాంకమునం దున్నాడు. సప్తమాంకమునందులేడు. అనగా పంచమాంకమునందు మొదట కొంచెము మరిరెం డంకముల యందును.

తొలుత పంచమాంకము మొదట విదూషకుని ప్రస్తావన గురించి విచారింతము. పంచమాంకమీ నాటకమున కాయువుపట్టైనది. ఈ యంకములోననే శకుంతలా ప్రత్యాఖ్యానము జరిగినది. కథకీ యంకము నాభిభూతమైనది. ఈ యంకమునందు మొదటి తొమ్మిది వాక్యములలోని ప్రసంగములందు మాత్రమే విదూషకు డున్నాడు. ఆ ప్రసంగ మేమి? విదూషకుడు రాజుతో "సంగీత శాలాంతరమునందు శ్రద్ధ వహించుము. కలవిశుద్ధ గీతియందు స్వరయోగము వినబడుచున్నది. పూజ్యురాలైన హంసపదిక వర్ణ పరిచయము చేయుచున్నది. హంసపదిక పాడిన గీతిక వినిపించినది. అందులోని యక్షరార్థము నీకు తెలిసినదా?" యని యడిగినాడు. రాజు హంసపదికను సమాశ్వసించినట్టి మాటలు చెప్పుమని విదూషకుని

పంపించినాడు. విదూషకుడు వెళ్ళినాడు. ఇంతే కథ. ఇందులోని యర్థమేమి ?

హంసపదిక పాడిన గీతి ఇది. "ఓయి మధుకరా! నీవు అభినవ మధులోలుపుడవు. ఆ రీతిగా చూత మంజరిని ముద్దిడికొని కమలవసతిమాత్ర నిర్వృతుడవై ఆ చూతమంజరి నెట్లు మరచిపోయితివి ?" ఈ గీతిక సామాన్య కథాగతమై రాజుయొక్క దక్షిణ నాయకత్వమును నిరూపించుచున్నను ప్రధానముగా రాబోవు కథను సూచించుచున్నది. ఈ యంకము లోననే శకుంతలను వెంటబెట్టుకొని కణ్వశిష్యులు వత్తురు కదా ? ఆ శకుంతల నితడు మరచి పోయినట్లు నిరూపింపబడబోవుచున్నది గదా! దాని కిది సూచన. శకుంతలను మరచిపోవుట యన్నది హంసపదికమీద బెట్టి యిది వ్రాయబడినది. రాజుయొక్క విస్మృతి లక్షణ మిందు ప్రతిపాదింప బడినది. ఈ విస్మరణమును తొలగించువాడెవడు ? విదూషకుడు. ఇతడు రాజుయొక్క మనస్థానీయుడు. అందుకనియే తక్కిన యంకములందు విదూషకుడు లేడు. రాజు శకుంతలను మరచిపోయిన ఏతత్సంబంధమైన మనస్సు రాజునకు లేదు. ఆ మనస్సునకు పతాకభూతుడైన విదూషకుడు లేడు. రాజు మరచి పోవుటయు విదూషకుడు లేకపోవుటయు నొక్కటియే.

విదూషకుడు రాజుయొక్క మనస్సులో నేభాగమును ఆక్రమించుకొనుచున్నాడు ? నాయికా ప్రథమానురాగ తీవ్రతా లక్షణమున కతడు మూర్తి. మరియు విప్రయోగ కాలిక పరమతీవ్ర చింతనా లక్షణమున కతడు మూర్తి. అనగా రాజుయొక్క స్త్రీ సంబంధమైన తన భావనా లక్షణమునకు విదూషకుడు ప్రతి బింబముగా కనిపించుచున్నాడు. ద్వితీయాంకములో రాజు శకుంతలనుగూర్చి తీవ్రముగా నాలోచించెను. ఆ యాలోచన యంతయు రాజ విదూషకుల నడుమ ప్రశ్న సమాధానములుగా భావించుచున్నదేకాని శకుంతలా సంబంధి సంకల్ప వికల్పముల విస్మృతియే ద్వితీయాంకము. షష్ఠాంకము నందలి విదూషకుడు రాజుయొక్క తీవ్ర వియోగభావ చిహ్నము.

ఈ విదూషకునకు రాజునకు భేదమేమియులేదు. మాతలి రాజునకు కోపము తెప్పించుటకు విదూషకుని హింసించినాడు. ఎందుకిట్లు చేసితివని రాజడుగగా మాతలి ఇట్లనెను. 'ఎందుకో తెలియదుగాని మన స్సంతాపము వలన మనోవైక్లబ్యము నీవు పొందినట్లు నేను చూచినాను. నిన్ను కోపింపచేయుట కిట్లు చేసినాను. ఎందుచేతవనగా కట్టెలు కదలించినగాని నిప్పు మండదు. కోపింపజేసినగాని పాము పడగ విప్పదు. క్షోభ వలనగాని తన మహిమ పురుషుడు తాను తెలిసికొనలేడు.' ఈ యర్థమునకు లక్ష్యభూతమైన కోపము రాజునకు రావలయుననగా రాజు మనస్సు తీవ్రకోప మవలంబించవలయునన్నమాట. విదూషకుని పెట్టిన బాధవలన రాజున కెంతో కోపము వచ్చునని యర్థము. ఎందుచేత గావలయును? కోపము వచ్చినది దేనికి ? మనస్సునకు. మనస్థానీయుడైన విదూషకునియందు చేయబడిన యపకృతి మనస్సునకుకోపము వచ్చుటయే.

మరియు రాజు చపలుడుకాడు, సత్పురుషుడు. సత్పురుషునియొక్క మనస్సు సంచలించదు. శకుంతలా విషయక విస్మృతి చాంచల్యము, మనోలక్షణము. ఇది సత్పురుషుడైన రాజున కెట్లుండును ? కాని అతని మనస్సునకి చపలత్వమున్నదే ? చపలత్వ మేకదేశవిషయము కావచ్చును. కాని యున్నది. రాజునందుండుటకు వీలులేదే ? అందుచేత రాజులో నొక భాగమైన విదూషకుడా చపలుడు. రాజునకంటె విడిగా నున్నాడు. కాని రాజులో భాగమే. అందుకనియే 'చపలోఽయం వటుః కదాచిదస్మత్ప్రార్థనా మంతః పురేభ్యః కథయేత్' అన్నమాట.

ఈ రాజునకు విదూషకున కంతటి యవినాభావ సంబంధ మున్నదా ? యన్నచో నున్నది. దానిని కాళిదాసు చిత్ర చిత్రముగా నిరూపించినాడు. పలు వాక్యములు దీని కుదాహరణములు కలవు. మరియు గాఢార్థములు కలవానినే చూపింతును. తల్లి దగ్గరకు

విదూషకుని పొమ్మన్నప్పు డతడిట్లన్నాడు. 'తేనహి యథా రాజానుజేన గంతవ్యం తథాగమిష్యామి' అనుజుడన్న శబ్దమునకు తమ్ముడనియు, వ్యుత్పత్త్యర్థముచేత యనుసరించి పుట్టినవాడనియు నర్థము. అనుసరించి పుట్టుట యనగా శృంగారరససంబంధమైన రాజు యొక్క మనోలక్షణము ననుసరించి పుట్టినవాడు.

అదియేమి చమత్కారమో శకుంతలాప్రస్తావన విదూషకునితో జరిగినదిగాని విదూషకుడుశకుంతలను చూడనుకూడలేదు. ఇది యాశ్చర్యము. విదూషకుని యొక్క సంపూర్ణమైన స్వరూపము షష్ఠాంకమునందు ప్రపంచింపబడినది. రాజు విదూషకునితో నిట్లన్నాడు. "ఓయీ ! ఇప్పుడు నేను శకుంతలా ప్రథమ వృత్తాంతమును స్మరించుచున్నాను. ఇది నీతో చెప్పినాను. నేను శకుంతలను తిరుగగొట్టినప్పుడు నీవు లేవు. పూర్వము నీవొకప్పుడును కథలయం దామెపేరే యెత్తలేదు. నావలె నీవుకూడ మరచి పోయితివా ?" అని యడిగినాడు. విదూషకుడు "నేను మరచి పోలేదు. నీవంతయు చెప్పి ఇది పరిహాస విజల్పితమన్నావు. మృత్పిండబుద్ధిని నేనట్లే గ్రహించితిని." అని విదూషకుడు సమాధానముచెప్పి తరువాత నన్నాడు గదా "అథవా భవితవ్యతా బలవతీ" దైవము బలమైన దన్నాడు. విదూషకుడు సేవకుడు. రాజు నాశ్వసించవలసినవాడు. దైవము బలమైనది. మన మేమి చేయగలుగుదుమన్న శాకత్తు వాడికి కలదా ? ఉన్నది. ఎందుచేత ? రాజుమనస్సులో నతదేకదేశమగుటచేత. అయినచో నతడు తాను మృత్పిండబుద్ధి నన్నాడు. మనస్సు వేరు. బుద్ధివేరు. మనస్సెప్పుడును బుద్ధికాదు. నిశ్చయాత్మకమైనది బుద్ధి. సంకల్ప వికల్పాత్మకమైనది మనస్సు. మనస్థానీయమైనవాని విషయములో బుద్ధిప్రస్తావన లేదు. అది మృత్పిండ సదృశమే.

కాని ఈతడు రాజుయొక్క మనస్థానీయుడై యుండుటయే కాక వేరయొక పాత్రగా నిర్మింపబడినాడుకదా ! నాటకమునందలి యేతత్కథాంశమునకు వెలిగా విదూషకు డొక పాత్రయే. ఆ పాత్ర దృష్ట్యా చూచినచో నతడు మృత్పిండబుద్ధికాదు. అతడుపరమ వివేకి. ఎట్లగుగును ? మన నొక వ్యక్తి కుండును. ఆ వ్యక్తియొక్క సర్వలక్షణము మనస్సునందు ప్రతిబింబించుచుండును. ఆ వ్యక్తి సత్పురుషుడైనచో మనస్సునం దొక నియమముండును. నియమము కలిగినను మనస్సునకున్న చాంచల్యము మనస్సునకుండును. ఆమనస్సునకున్న సదూహలన్నియు దానికుండును. రాజుయొక్క మనస్సుకున్న దోషమొక్కటియే. శకుంతలా విషయికవిస్మృతి. అంతమాత్రము చేత ఆమనస్సు సత్పురుషుడైన రాజుయొక్క సర్వ సద్భావములను ప్రతిబింబించదా ? ప్రతిబింబించును. పూర్వవ్యాసములలో రాజుయొక్క ఈసత్తు తెలిసినవారిద్దరే యని చెప్పబడినది. రథచోదకుడు. విదూషకుడు. విదూషకున కెట్లు తెలియును ? అతడు రాజు మనస్సులో నేకదేశము, ఎట్లు తెలియకుండనుండును. రథచోదకున కెట్లు తెలియును. ఈ నాటకములో రథమనగా నేమియో పూర్వవ్యాసములందు నిరూపింపబడినది. ఆ రథమును నడిపినవాడు కథా సూత్రధారుడు. కథను నడిపినవాడే వాడు. వాడు బ్రహ్మయొక్క స్థానీయుడు. అందుచేత వీరిద్దరే యుందురు.

విదూషకుడు సత్పురుషుడైన రాజుయొక్క మనస్సు. ఆ మనస్సునందు సర్వలక్షణములవశ్యముగా నుండును. విదూషకుడు మహా మేధావి. శకుంతలా ప్రత్యాఖ్యాన సమయ తత్ బాష్పప్రసర కలుషితదృష్టి రాజు భావించినపుడు విదూషకు డిట్లన్నాడు.

"హా ! అస్తి మే తర్కః,
కేనా ప్యాకాశచారిణా తత్ర భవ త్యపనీతేతి."

ఎవడో యొక యాకాశచారిచేత యా పూజ్యురాలు తొలగింపబడినదని నే ననుకొనుచున్నాను. ఆమె తొలగింపబడుట చూచినవాడు పురోహితుడు. ఇతడు చూడలేదు. ఇతడు వినమలేదు. ఇత డూహించుచున్నాడు. ఆ మనస్సంత శక్తికలది. కావవశమున

విస్మృతి పొందినది కాని సహజముగా నా మనస్సున కున్న యాలోచనాశక్తి యట్టిది.

ఈ యంకమును జాగ్రత్తగా చూచినచో ప్రక్కన నదృశ్యురాలై యుండిన సానుమతియొక్క యూహ లన్నియు విదూషకుడు ప్రశ్నించును. అనగా మంచి యాలోచనకల మనస్సు లక్షణములు వానియం దున్నవి.

రాజు నుంగరము నధిక్షేపించుచుండగా విదూషకుడు "గృహీతో ఽనేన పంథా ఉన్మత్తానామ్" ఈ మార్గము పిచ్చివారిది. పిచ్చివా డనగా మనస్సు చెడినవాడు. రాజుమనస్సు విదూషకుడే. అతడు సుస్థితిలోననే యున్నాడు. రాజుయొక్క ఉన్మాదమును తిరిగి తిరిగి వారించుచున్నాడు. ఈ విదూషకుడు (అనగా రాజుయొక్క పరమవివేకమైన మనస్సు) లేనిచో రాజు ఉన్మత్తుడు కావలయును. (విక్రమోర్వశీయములోని రాజువలె) ఈరాజు బ్రహ్మవేత్త. ఇత డున్మత్తుడు కాడు.

రాజుంగరము నధిక్షేపించినాడు. మరల తన్ను తాను నిందించుకొన్నాడు. అప్పుడు విదూషకుడు తన మనస్సులో నిట్లనుకొన్నాడు. "ఆః అహంఖలు బుభుక్షయా ఖాదితవ్యోఽస్మి" నే నాకలిచేత తినబడ దగినవాడ నగుచున్నాను. అని అర్థము. దీని తాత్పర్య మేమి ? దీని యర్థము వ్యాఖ్యానపేశలము కావలయును గాని లేనిచో లేదు. వ్యాఖ్యాన మిట్లు చెప్పుచున్నది. రాజు శకుంతలా విషయికమైన రిరంస కలిగియున్నాడు. ప్రక్కన యామె లేదు. అందుచేత రాజు నన్నే తినును. ప్రక్కన నింకెవ్వరు లేరు గనుక నన్నే శకుంతల ననుకొనునేమొ ! అని యర్థమని వ్యాఖ్యానము. మరియు శ్రీనివాసాచార్యుడు "ఇతి పలాయనచింతా వ్యజ్యతే" అని వ్రాసినాడు. అని అచ్చటినుండి పారిపోవుదమని విదూషకు డూహించుట దీనిచేత గమ్యమాన మగుచున్నదని యర్థము. ఇంత చెప్పినను దీని తాత్పర్యము నిస్పష్టము కాలేదు. లేనిచో నొక నేదో యసభ్యార్థ కల్పన చేయవలయును. అది అనిష్టాపత్తి. ఈ అనిష్టాపత్తి కలుగకుండుటకు దీనియందలి వ్యంగ్యము రాజుయొక్క మనస్సు పడుచున్న బాధయొక్క పరమ స్వరూపమని చెప్పవలయును. మన స్థానీయుడైన విదూషకుడు కూడ లేచి పోవలయు ననగా రాజుయొక్క మనస్సు లేచిపోవుచున్నది. రాజు ఉన్మత్తు డగుచున్నా డనియెడి వ్యంగ్యమును తీసివేసినచో ఇచట అర్థమేమియు పొసగదు. ఈ వాక్య బలము చేత నిస్సంశయముగా విదూషకుడు దుష్యంత మన స్థానీయు డగుచున్నాడు.

సంస్కృత నాటకకర్తలు నాటక మనగా నేమి యని వా రుద్దేశించిరో, ఉద్దేశించినట్లు కనబడునో, నాటకాంగములకంటె భిన్నములైన యే లక్షణములు వారి నాటకములయందు నాటకత్వ నిరూపణశక్తి కలవో, విమర్శించుట యీ వ్యాసముల ఉద్దేశ్యము కాదు. కాని ప్రాస్తావికముగా రాజు గీసిన బొమ్మను గురించి చెప్పవలయును.

రాజు శకుంతలా రూపమును తా నెట్లు భావించెనో ద్వితీయాంకమునందు విదూషకునితో చెప్పెను.

"చిత్రే నివేశ్య పరికల్పిత సత్త్వయోగా
రూపోచ్చయేన విధినా మనసా కృతాను"

లోకమునందున్న సర్వసౌందర్యములు చిత్రమునందు పెట్టి సత్త్వయోగము కల్పింపబడినట్లున్నది. రాజు చిత్రకారుడు. ఆమె రూపమును భావన చేసెను. అది షష్ఠాంకము నందలి విరహావస్థా సమయమున ప్రదర్శింపబడినది. ఆ చిత్రమును చూచి విదూషకుడు.

"మధురావస్థా దర్శనీయో భావానుప్రవేశః
స్ఖలతీవ మే దృష్టిర్నిమ్నోన్నత ప్రదేశేషు"

అన్నాడు. ఆ విదూషకుని సంగీతజ్ఞానము హంసపదికా గీతికాశ్రవణ సమయమున, చిత్రలేఖన కళా పరిజ్ఞానమీ సమయమున వ్యక్తమగుచున్నది. అతడు బుద్ధిహీనుడు కాడు.

ఈ ముగ్గురిలో శకుంతల యెవరని యడిగినాడు. ఎవరు శకుంతలయని నీ వనుకొనుచున్నావని రాజడుగగా నీమెయై యుండవలెనని చెప్పుచున్నాడు. ఆ చెప్పుటలో సొగసున్నది. "ఏ యమ జారుముడిలో

నెగసెన త్రోయబడిన పూవులు గల జుత్తుతో, స్వేద బిందువులు గల మొగముతో చేతులు విసరుకొంచు పాదులో నీళ్ళు పోయబడి లేత చివుళ్ళు గల మామిడిమొక్క దగ్గర కొద్దిగా బడలినట్లు చిత్రించ బడినదో ఆమె శకుంతల యనుకొనుచున్నాను"— అట్టి శకుంతలయందు రాజు లగ్నమనస్కుడు. ఆమెయే శకుంతల యని ఇత డనుకొనుచున్నాడు. రాజుయొక్క యూహకును వీని యూహకును భేద మున్నట్లు లేదే!

మరియు ఆ బొమ్మలో తుమ్మెద వచ్చి శకుంతల మొగముమీద వ్రాలుచున్నట్లు వ్రాయబడినది. ఇది సార్వకత. పూర్వమందు రాజేమన్నాడు. "అవినయమాచరత్యవినయం ముగ్ధాసు తపస్వి కన్యాసు" యన్నాడు. అవినయమాచరించుచున్నాడు. ఎప్పుడు? "పౌరవే వసుమతీం శాసతి శాసితం దుర్వినీతానాం" ఇచ్చట అవినయము, శాసనము - రెండు మాట లున్నవి. ఈ యారవయంకమున బొమ్మలోనున్న తుమ్మెదను చూచి "ఏమయ్యా! ఆ పూజ్యురాలు యెఱ్ఱకలువ పూరేకులవంటి వ్రేళ్ళతో మొగమును కప్పుకొంచు భయపడినదానివలె ఉన్నది. ఈ దాసీ పుత్రుడు దుష్ట మధుకరము ఆమె మొగముమీదికి లంఘించుచున్నాడు" అని విదూషకుడనగా "నివార్యతా మేషదుష్టః' యన్నాడు. దానిని నివారించుమని యర్థము. దీనికి సమాధానము విదూషకుడు చెప్పిన దిది."భవానేవావినీతానాం శాస్తాస్య వారణే ప్రభవిష్యతి" సరిగా విదూషకుని నోట రాజునోట వచ్చిన అవినీతి శాసనశబ్దములు వచ్చినవి. ఇచ్చట నున్నది రహస్యము. ఇట్టి పరమ రహస్యములైన యర్థశబ్దముల విశేషణములచేత కాళిదాసు విదూషకుని సృష్టిని ఈ వ్యాసమునందు చెప్పబడుచున్న యర్థమును మనసులో పెట్టుకొని చేసెననుకొనుటకు వీలున్నది. సర్వదా అట్లు కన్పించుచున్నది గదా! ఇది యిట్లుండగా ఆ యవినీతి రాజే శాసింపదగియుండుటయొక్క లక్షణమును విచారించినయెడల నచట మధుకరము అవినయములేదు. శాసనము లేదు. దాని వెనుక నేదో యర్థ మున్నదన్నమాట. ఆ యర్థము భావుకులైన వారికే తెలియును. దానిని ప్రపంచించినచో మరియు నెంతయో వ్రాయవలసి వచ్చును.

ఇట్లు చూచినచో విదూషకుడు కాళిదాసు నిర్మించిన సత్పదార్థ నిర్ణాయక వస్తులక్షణము ప్రతిబింబించుచున్న దుష్యంతునియొక్క మనస్థానీయుడుగా గోచరించును. వేరే విదూషకుని తీసికొని యాధునికుల వలె నతని పాత్రపోషణము విచారించినచో వ్రాయదగిన వెన్నియో యున్నవి. ఇంతవరకు శాకుంతలము మీద వ్రాయబడిన విమర్శ యంతయు నేతద్విషయము మనస్సులో పెట్టుకొని పఠితయైనవాడు చదివినచో నొక విలక్షణమైన యర్థము భాసించునని సూచించుటకేకాని మహాప్రభువైన కాళిదాసుని సృష్టి చాతుర్య మంతయు నిరూపింపబడినదనుటకు వీలు లేదుగదా! పరమ భావుకులకు నమస్కరించి ఈ వ్యాసములు ముగింపబడుచున్నవి.

# బాజీ | కపర్ది

అసలీ కథ నే నెవరితోనూ చెప్పవద్దనుకున్నాను. నాకా సంగతి తలచుకున్నప్పుడల్లా దుఃఖం పొంగి వచ్చి కడుపు చెరువై పోతుంది. ఆ కలక నాల్గైదు రోజులుదాకా తగ్గనే తగ్గదు. ఇది జరిగి చాలా కాలమైంది. కొత్తలో నాల్గైదేండ్లదాకా వద్దనుకున్నా బాగా గుర్తుకు వస్తుండేది. కానీ క్రమక్రమంగా పరిసిపోయిందనుకున్నా. నా కిప్పుడైతే దానంతట అది గుర్తురావడంలేదు కాని నా భార్యో, మేనత్తో కదిలించినప్పుడు మళ్ళా కలక వేసి అంతబాధా పెడుతుంది. ఇంత కాలమైనా ఈ బాధ తగ్గకపోవటానికి కారణ మేమిటా అని యెంతో ఆలోచించాను. ఈ కథంతా విన్న తరువాత మీరేమంటారో నాకు తెలియదు గాని నాకుమాత్రం ఒక్కటే ఒక్క కారణం కనబడుతున్నది. అది యేడవాలిసినపుడు యేడవలేకపోవటం.

అప్పటికి నాకు ఇరవై రెండు, ఇరవై మూడేళ్ళ కంటే ఎక్కువలేవు. ఇప్పటికి పదిహేడేళ్ళ కిందటి మాట. ఏదో ఒక చిన్నస్కూల్లో మాస్టరుగా పనిచేస్తున్నాను. నా కప్పటికే ఇద్దరు పిల్లలు. జీతం ఇరవై రూపాయలు. కడుపునిండా అన్నం ఒంటినిండా బట్ట వీటికి కటికికటికిగా కాలంగడుపుతున్న రోజులు. రెండో పిల్లవాడికి మా మేనత్త కృష్ణుడని పేరు పెట్టింది. వాడు నల్లగా ఉండేవాడు. కొంచెం బొద్దుగా ఉండేవాడు. విశాలమైన నుదురూ, పొట్లాలవంటి కాళ్ళూ చేతులూ. పిల్లవాడు కుదిమట్టంగా ఉండి ముద్దువొస్తూ ఉండేవాడు. మేమంతా వాణ్ణి బాజీ అని పిలుస్తుండేవాళ్ళం. కుఱ్ఱవాడికి ఏడాది వెళ్ళకముందే మాటలు అన్నీ వొచ్చాయి. తప్పటడుగులు వేస్తూ ఉండేవాడు. నేను స్కూలునుంచి రాగానే గబగబా పాకుతూ నా దగ్గరకు వచ్చి చిటికెనవేలందిస్తే పట్టుకుని లేచి నిల్చొని 'ఎత్తో ఎత్తో' అనేవాడు. ఎత్తుకుంటే ముఖంమీద ముఖం పెట్టి కిలకిలా నవ్వేవాడు. చెవిలో కూ అని కూస్తే మళ్ళా వాడిమూతి నా చెవిదగ్గర పెట్టి కూ అని కూసేవాడు. ప్రొద్దున పూట నేను బళ్ళోకి వెళ్ళేంతవరకూ పాలు తాగేప్పుడు తప్ప వాళ్ళమ్మదగ్గర ఉండనే ఉండేవాడు కాడు.

బాజీకి ఏడాది వెళ్ళి ఆరునెల్లయినా కాలేదు. మా చెల్లెలు మొగుడికి ప్రాణంమీదికి వొస్తే వాణ్ని చూట్టానికి నేను వెళ్ళకతప్పిందికాదు. అక్కడికి మా పెత్తండ్రి కుమారుడూ వాళ్లూ వచ్చారు. వాళ్ల పిల్లలు పొద్దుకూకులూ బాజీని ఎత్తుకు తిరుగుతూ ఉండేవాళ్లు. ఆ గొడవలో మేం చూసీచూడకుండా కొంత, చూసినా వొద్దంటే బాగుండదని కొంత ఊరకున్నాము. ఆ దిక్కుమాలిన కర్మం వాళ్లపిల్లల దగ్గరే అంటినట్టుంది అని తరువాత నాకు తెలిసింది. రెండు మూడు రోజులుండి నేను మళ్ళా మావూరు వచ్చేశాను. నా భార్యాపిల్లల్ని మాత్రం అక్కడ ఉంచకతప్పలేదు.

పది పదిహేనురోజులైన తరువాత నా భార్య తిరిగి వచ్చింది. వచ్చేసరికి పిల్లవాడికి ఒంటినిండా కురుపులు లేచివున్నాయి. ఇవేవో సామాన్యమైనటువంటి పొక్కులేగదా అని ఆమందూ ఈమందూ పట్టించేవాళ్ళం. అవి అప్పటికప్పుడు నయమై మళ్లా పొటమరిస్తూ ఉండేవి. ఇట్లా మూడునాలుగు నెలలు జరిగేసరికి బంతిలాంటి పిల్లవాడు చిక్కి శల్యమై పోయినాడు. నవ్వుతుంటే గుంటలుపడే బుగ్గలు

బాగా చిక్కిపోయి పిల్లవాడంతా నల్లకప్పేసిపోయి వాడు. కురుపులకు యథాప్రకారం ఏదైనా మందు రాస్తే పచ్చగా అట్టకట్టడం మొదలుపెట్టినవి. రసి కూడా పచ్చగా వస్తోంది. ఈ మందుల్తో లాభం లేదని ఓ ఇంగ్లీషు డాక్టరు దగ్గరికి తీసుకుపోయాను. ఆయన చూచి ఇంజక్షనులు ఇవ్వాలి. పద్నాలుగు రూపాయలవుతుంది అన్నాడు. బాబో! పద్నాలుగు రూపాయలే. పద్నాలుగు రూపాయలంటే నాకు మూడు వారాల జీతం. నేనెక్కడి నుంచి తేగల నబ్బా! అయ్యా, డాక్టరుగారూ! నే నంతఇచ్చుకో లేనండీ! చాలా పేదవాణ్ణి. తిండి బట్టకే కటుకుగా ఉంది. ఇంతచిన్నపిల్లవాడికి పద్నాలుగురూపాయల ఖరీదు గల మందు భరించే తాహతుందా! రెండు మూడు రూపాయలకంటే ఎక్కువ ఇచ్చుకోలేనని చెప్పుకున్నాను. బతిమాలి చెప్పుకున్నాను. డాక్టరు 'పోపోవయ్యా! ఇచ్చుకోకపోతే నేనేం చేసేది. నీ సొదంతా వింటానికి నాకు టైంలేదు. ఆ పద్నాలుగు రూపాయలుతెస్తే రేపు ప్రొద్దునరా, ఇంజక్షనిస్తాను' అని చరచరా వెళ్ళిపోయాడు. నేను నా భార్య మొహం చూశాను. ముక్కు పుడకలు గాని దుద్దులు గాని లేవు. నాకు ఆమె కళ్లలో నీళ్ళు తప్ప ఏమీ కనిపించలేదు. నాకేం దుఃఖంరాలేదు. 'ఏం ఎందు కేడుస్తావు. అసలు వీడు ఎనిమిదో నెలలో పుట్టాడు. బతికేడుస్తాడా! ఆ పద్నాలుగు రూపాయలూ ఎక్కడో తలకాయ తాకట్టుపెట్టి తెచ్చి ఆ డాక్టరుకి సమర్పించడమే తప్ప వేరే లాభమేమీ ఉండదు. వెధవ సంతానం. వీడికోసం ఏడవట మెందుకులే రమ్మన్నాను.

మళ్లా నెల గడచింది. బాబీ ఇంకా క్షీణించడం మొదలుపెట్టాడు. రోజూ పొద్దస్తమానం ఒకటే ఏడుపు. నన్నేం పనిచేసుకోనివ్వడు. ఆ యేడుపు వింటే చెవులు గింగుర్లెత్తుతుండేవి. వాణ్ణి చూస్తే చిరచిర పుట్టేది. ఇంటికి వొస్తేనే నాకు మహా చిరాకుగా ఉండేది. నేను వొచ్చేసరికల్లా వాడు తెగ ఏడుస్తూఉండేవాడు. వాళ్లమ్మ ఎత్తుకొని ఎంత సముదాయించినా ఊరకుండేవాడు కాదు. నన్ను చూడగానే 'అదుగో నాన్న' అని నా దగ్గరకు తీసు కొస్తే అంత యేడుపులో కూడా వాడు నా మీదికి దూకేవాడు. నే నెత్తుకొంటే కిలకిలా నవ్వేవాడు. నా దగ్గర ఉన్నంతసేపూ కిక్కురుమనకుండా ఊర కునేవాడు. నాలుగురోజులు పోయింతరువాత మా యింటి దూరపుబంధు వొకాయన వచ్చి ఏదో ఆకుపసరులో కలిపి రాయమని ఓ మందు చెప్పి వెళ్లాడు. ఆ మందు రాచాము. పిల్లవాడికి కురుపులు తగ్గాయి. కాని మళ్లా కోలుకోలేదు. అంతకంతకూ పిల్లవాడు క్షీణించిపోతూనేఉన్నాడు. వెనుకటిమల్లే బిగ్గరగా ఏడ్చే శక్తి కూడా వాడి ఒంట్లో ఇప్పుడు లేదు. వాడి ఒంట్లో చిన్న మెత్తు ఓపిక కూడా లేదు. కాని వాడి కళ్లల్లో మెరుపు మాత్రం తగ్గలేదు. బలహీనంగా ఉండి కూర్చోలేకపోతున్నప్పటికి నన్ను చూడగానే ఎత్తుకోమన్నట్లు చేతులెత్తేవాడు.

ఓ రోజున మా మామగారు వచ్చి పిల్లవాడికి మా ఊళ్ళో ఆచార్యులుచేత మందిప్పిస్తాను పంపించ మన్నారు. సరేనని నేను ఒప్పుకున్నాను. ఆయన నా భార్యపిల్లల్ని తీసుకొని ఆ సాయంకాలమే వెళ్ళాడు,

నెలరోజులైం తరువాత మా అత్తవారి ఊరి నుండి ఉత్తరం వచ్చింది. ఆ ఉత్తరంలో సారాంశం బాబీ పోయినాడని. నేనా ఉత్తరం చదివి చించి పారేసి మెదలకుండా ఊరకున్నాను. మా మేనత్త 'ఏరా! నాయనా ఉత్తరం చించిపారవేశావు' అని ఆదుర్దాగా అడిగింది. నేను తాపీగా సంగతి చెప్పాను. నాకేమీ కష్టమనిపించలేదు. ఏడుపు తెచ్చుకుందామన్నా రాలేదు. వాడట్లా బాధపడే కంటే పోతేనే మెరుగులే అనుకున్నాను. మా అత్తయ్య మాత్రం బిగ్గరగా ఏడ్చింది.

మూడు నెలల తరువాతగానీ నా భార్య పుట్టింటి నుండి రాలేదు. మా పెద్దపిల్లవాడు ఐదేళ్ళవాడు బాగానే ఉన్నాడు. వాడేం చిక్కిపోలేదు. వచ్చి నా చంక కెక్కాడు. వెనక రిక్షాదిగి నా భార్య

గడపలోకి రాగానే నావంక చూచి కన్నీళ్లు పెట్టుకుంది. మా అత్తయ్యగూడా కన్నీళ్లు పెట్టుకొంది. నాకు మాత్రం ఏమీ అనిపించలేదు. 'ఎందుకే ఏడుస్తారు మీ పిచ్చిగాని వాడు ఎనిమిదో నెలన పుట్టాడు. బతికేడుస్తాడనుకున్నారా! అంత బాధ పడేకంటే పోతేనే మెరుగు, ఊరుకోండి'అన్నాను. రాత్రి అన్నం తింటూండగా నా భార్య కథంతా మొదలు పెట్టింది. మా మామగారు వాడికి పది రూపాయలు కర్చుచేసి మందిప్పించాడట. కాని మందేమీ ఒంటపట్టలేదట. ఇంకా రేపు పోతాడనగా పిల్లవానికి కళ్ళు కనిపించటం మానివేశాయట. వాడు కళ్ళెప్పుడూ మూసుకొని ఉండేవాడట. బాజీ అని పిలిస్తే ఆ ధ్వనివంకకు ముఖం తిప్పేవాడట. బాజీ ఇదుగో బొమ్మ అంటే చేయెత్తి వెతుక్కునేవాడట. ఇంకో గంటసేపటికి పోతాడనగా బాజీ అదుగో నాన్న అంటే ఎత్తుకోమన్నట్టు చేతు లెత్తాడట.

నేను ముద్ద నోట్లో పెట్టుకో బోతున్నాను. నా కంఠంలో ఏదో ముద్దకట్టి అడ్డపడ్డట్టయింది. చేతిలో ముద్ద కంచంలో పడేశాను.

అనుముల కృష్ణమూర్తి

# విమర్శ - కొన్ని సూచలు

తెలుగు సాహిత్యములో ప్రామాణిక స్థాయి నందుకొనకుండగనే పతనము వైపు మొగ్గుచున్న 'విమర్శ' కీ వ్యాసము కొంత సహాయకారి కావచ్చును.

జరుగుచున్న రచనా వ్యాసంగము పుష్కలమే యైనను జరిగిన సాహిత్యసృష్టి మాత్రము అతి స్వల్పమైన ఈ కాలమున విమర్శ అత్యవసరమగు చున్నది. భిన్నభిన్న రంగములలో నవ్యనవ్య ప్రక్రియలతో సాగుచున్న కృషి కేవలము బండ రచనల సృష్టికి దారితీయుచున్నది కాని 'శాశ్వతమైన విలువ' గల 'జీవ' సాహిత్యము నిచ్చుటలేదు. క్లాసిక్ అనగా ఆయా శాఖలలో సృష్టించబడిన అత్యుత్తమస్థాయికి చెందిన రచన. ఈ జీవద్ధర్మము కథా, కావ్యనాటకాదుల రచనమునకే పరిమితము కాదు. ఏ శాస్త్రగ్రంథమునందైనను వ్యక్తము కావలసియుండును.

విమర్శ సాహిత్యమునకు ప్రాణాధారము వంటిది. ఉత్తమ విమర్శ లేనిదే ఉత్తమ సాహిత్యము బయటపడదు. విమర్శ యొక్క విలువ విమర్శకుని స్తోమతను బట్టి యుండును. ఆ స్తోమతను స్థూలముగా మూడు విధములుగ విభజింప వచ్చును.

1. ప్రత్యేక సాహిత్య విజ్ఞానము.
2. అనుబంధ విషయ పరిజ్ఞానము.
3. నైతిక పరిణతి.

పై మూడింటిలో నేది లోపించినను విమర్శకొక స్థాయి ఏర్పడదు. అట్లేర్పడని కారణము వలన ప్రతి సమీక్ష, వ్యాఖ్యానము తుదకు అభిప్రాయములు 'తొలిపలుకులు' ను విమర్శలుగనే వ్యవహరింపబడుచున్నవి. ఈ యపోహ హానికరము కాకున్నను, ఎప్పుడో ఒకప్పుడు నివారించుకొనబడవలసిమాత్రమున్నది. ఈ యపోహ 'మధ్యతరగతి' విమర్శకులలో గనుపించును. మధ్యతరగతి వారన అనిశ్చితాభిప్రాయములుగల 'రసికవిమర్శకులు'. వీరి తెగ చాల సాధువైనది. తమ యభిప్రాయములు సరియైనవిగావని తేలినప్పుడు సంపూర్ణముగ నంగీకరించెదరే కాని తాము చిక్కులలో బడి ఇతరుల చిక్కుబెట్టరు. వీరొకవిధముగ సాముదాయిక రచనకు దోహదకారులే యగుచున్నారు. హానికరమైనది 'విమర్శ' కున్న యపార్థము. విమర్శ యనిన దూషణ మనునది. ఈ యపార్థమీనాడు బహుళ ప్రచారములో నున్నది. విమర్శను భ్రూణహత్య చేయునంత సమర్థమైనది. కీర్తిశేషులు శ్రీ రామలింగారెడ్డిగారి 'కవిత్వ తత్త్వవిచారము' ఈ యపార్థమునకు కొంత దోహదమిచ్చినదన దుస్సాహసము గాదు. వారి కావ్య సంప్రదాయాజ్ఞానాభిమానములు నిశ్శంక్యములైనను వారి దృష్టి అప్రాచ్యమార్గ కలుషితమైనదనవచ్చును. ఉమాకాంత విద్యాశేఖరుల విమర్శ ఒక కసితో జరిగిన ట్లనిపించును. దీవించినను తిట్టినట్లనుపించుటయే వారి రచనలోని ప్రత్యేకత. నేటి యపార్థమునకు బలమిచ్చిన వర్గ మింకొకటి యున్నది. వీరిలో వీరు కక్షల పెంచుకొనెదరు. పెద్దన, రామరాజభూషణాదులపై దుమ్మెత్తి పోయుదురు. తుదకొకరొకరిపై విరుచుకొనిపడి తాము గ్రహించిన విషయము నిదమిత్థముగ దేల్చకనే విరమించుకొందురు. ఇట్లే మూడవ వర్గ మింకొకటి యున్నది. వీరికి పూర్వులనిన పూజ్య

భావము, ఆధునికులనిన అసహ్యము. మల్లినాథుని నుండి అపర మల్లినాథులవరకే మర్యాదయే పాటింపబడినది.

ఈ కారణములచే మన సాహిత్యములో చెప్పుకొనదగిన విమర్శగాని, విమర్శాసాహిత్యము గాని తగినంతగా రాలేదనిపించును. దీని పరిణామమును సూక్ష్మముగ పరిశీలించినచో పాఠకులపై బడినట్లు స్పష్టమగును. పాఠకలోక మొక సాముదాయికాభిప్రాయమునకే రాసమర్థమగుచున్నది గాని విశ్లేషణ పద్ధతిని స్వయంనిర్ణయాధికారమును సంపాదించలేకపోవుచున్నది. క్రొత్త మార్గములనిన, క్రొత్త భావములనిన తత్క్షణ మీసడించుకొనువారేర్పడినట్లే, ఏమాత్రపు సంప్రదాయవాసన, ధర్మాసక్తి గనుపించినను తత్క్షణము వెక్కిరించువారేర్పడినారు. ఈ దశ మనకేకాదు, పాశ్చాత్యులకు సైతమును పట్టినది. తమకన్న పూర్వుల నీసడించుకొనుటయే తమ గొప్పగ భావించుకొనుట యొక 'ఫేషన్' ఐనదని బ్రాడ్లేయనినాడు. ఈ అయోమయ పరిస్థితి లబ్ధప్రతిష్ఠులకో సాహసవంతులకో యనుకూలమగునుగాని భావిసాహిత్యకారులకుమాత్రము దోహదకరము గాదు. విమర్శ ఎల్లప్పుడును కొన్ని నిర్ణీత సిద్ధాంతములను, మర్యాదలను బట్టియే జరుగవలెను.

పాశ్చాత్యులు విమర్శించునప్పుడు స్థూలముగ కొన్ని నిబంధనల పాటింతురు. 1. రచయిత పాండిత్య పాటవము. 2. మనస్తత్వము. 3. పరిణతిదశ. 4. సంఘము - తద్రచనా ప్రభావ పరిమితి. 5. రచయితపై సాంఘిక ప్రభావము - దాని స్వభావము. 6. సాహిత్యమునందు ఆ రచనకుగల యథార్థస్థానము. భారతీయసాహిత్య విమర్శకునికి పై విషయములేకాక రచయిత జాతీయత, సంప్రదాయము - మత సిద్ధాంతములును ముఖ్యములగుచున్నవి. పాశ్చాత్యు లీ మూడింటి యవసరము నుండి తప్పుకొనిరి. వారింకను కొన్ని సూక్ష్మముల లక్ష్యమందుంచుకొని విమర్శింతురు. ఇట్టి విమర్శ ఆ రచయిత స్థాయిని బట్టియు, ఆతని రచనయొక్క వస్తుగంభీరతను విస్తారమును బట్టియు నుండును. 1. రచయిత బాల్యము 2. స్వభావము 3. ఆర్థికస్థితి 4. మనస్సును కదలించగల జీవితానుభవములు, 5. ఆదర్శములు మొదలైనవి వారు ముఖ్యములుగా గ్రహింతురు.

పై వానిని దృష్టియందుంచుకొనినచో విమర్శకునికి తాను విమర్శించదలచిన రచయితపై, ఆతని రచనపై ఒక నిశ్చితమైన అధికారము, అభిప్రాయము ఏర్పడును. అట్టి విమర్శలో నొక సహేతుకమైన క్రమపద్ధతియు వికాసమును గనుపించును. అభిప్రాయములలో ఆవేశము గాని మమకారము గాని కనుపించవు.

శాస్త్రసంబంధములైన రచనలలోకన్న 'కళల'లో ఆవేశమున కెక్కువగా ప్రసక్తి యుండును. ఆవేశపూరితమైన రచనా లక్షణము గాని, కావ్యత్వముగాని లేనిదే శాశ్వతసాహిత్యము గాదని కొందఱి మతమైనను శాస్త్రసాహిత్యములకు సంబంధించినంతవర కది ఉపాదేయముగా తోచదు. శిల్ప, చిత్రలేఖనాదులలోనేమి, కావ్యనాటకాదులలోనేమి రచయిత మాత్ర మావేశపూరితుడగుచునే యుపక్రమించును. ఆ యావేశ మాతని నుత్తేజితుని జేసిన "వస్తు" స్వభావము ననుసరించి లఘువుగనో దీర్ఘముగనో యుండును. విమర్శకుడు సైత మా యావేశమునకు గుఱియగుట తథ్యమేయైనను, దానిని నిగ్రహించుకొననిదే యాతని విమర్శ పక్షపాతరహితముగాదు. ఆవేశము విమర్శకునికి అనుభవయోగ్యమే గాని వాచ్యముగాదు.

ఆవేశము లేని రచన 'చప్పగా' నుండునని కొందరి యభిప్రాయము. అది చల్లబడి శాంతస్థితిలో పునర్మననీయమైనపుడే కవిత్వ సృష్టియని వర్డ్సువర్తనెను. ఇట్టి రచనలు విమర్శకుని దర్శనవైలక్షణ్యమునకు గీటురాళ్ళు. భావుకులైన కవిశిల్పిచిత్రకారులకు 'దర్శన' మెంత యవసరమో

విమర్శకుని కది యంత తప్పనిసరియగుచున్నది. పలనన కళాకారులు తమ రచనల 'ఉచ్చనీచతల'ను సమర్థించుకొన బాధ్యులుగారు. విమర్శకుడు మాత్రము తన యభిప్రాయముల యథార్థ స్థితిని నిరూపించుకొనవలసి యుండును. పాణిని యని నట్లు 'ఉపజ్ఞ'తో కూడని రచనమునకు ప్రమాణ ములే బలము నిచ్చును. విమర్శ ఒక సాహిత్య సృష్టిగాదు. సృష్టింపబడిన రచనకు ప్రమాణబలముచే దశానిర్ణయముచేయునది. కావు ననే విమర్శకుడెప్పుడును నిర్భయమలక సర్వజ్ఞుని వలె ప్రారంభించును. పాఠకుడు తనను విశ్వసించు నట్లు చేసికొనుటకై నానాసూక్ష్మముల త్రవ్వి విసి గించును. విమర్శకుని కెప్పుడును పాఠకునిపై కంటె తాను చేపట్టిన రచనకు న్యాయము గలిగించుటయే లక్ష్యముగానుండును. రచనలోని క్లిష్టాన్వయ సంద ర్భముల వివరించును. పాఠకుని యావేశమునకు మార్గము జూపుచు, సాహిత్యములోని అనుభూతు లకు అనుకూలముగా అభిరుచిని దిద్దును. ఇట్లొన ర్చుటలో నొక పరమార్థమున్నది. పాఠకుని సాహి త్యానుభూతికిని ఆతని జీవితానుభూతికిని సమన్వ యము కూర్చినవాడగును.

ఉత్తమ విమర్శకుని కెప్పుడును సత్యాన్వేషణమే ఆదర్శముగా నుండి, దానిని సుబోధకముగా ప్రవచించుటయేధ్యేయమైయుండును. ఆతని వాక్య రచనము "పుష్పితము" కాకపోవచ్చును. కొన్ని వేళల కటువుగా సైతము ఉండవచ్చును. పరిభాషా భూయిష్ఠమే గావచ్చును. కాని సత్యప్రవచనమే విధియైన విమర్శకుని రచనమున కేలోపములంటవు. విమర్శ, సృజనాత్మక సాహిత్యముకాదు కావున విమర్శకుడు స్రష్టకాక నిర్వాచకుడుమాత్రమే యగును.

ఇట్లుగాక విమర్శ నొక కళగా గొని గద్య సాహిత్యమునకు జెందునట్లు మెరుగులు దిద్దిన విమర్శకులు పాశ్చాత్యులలో పెక్కురుగలరు. వారు ప్రఖ్యాత రచయితను విమర్శించుచు వ్రాసిన వ్యాసములు శాశ్వత సాహిత్యరూపమును దాల్చినవి. వానిలోని వాక్యవిన్యాసము, ఉక్తి వైచిత్రి సమన్వయ పద్ధతులు గద్యాత్మక సాహిత్య పరిణతి నొందినవిగా నుండును. డ్రైడన్ నుండి టి. ఎస్. ఇలియట్ వరకును మన మీ ప్రత్యేకతను జూడవచ్చును. ఇలియట్‌లో ఈ గుణము మరింత స్పష్టమగును. తన కవిత్వము నొక క్లిష్ట సాంకేతిక సరళిలో అయోమయముగ నడిపించు ఇలియట్, విమర్శరంగములోఅరటిపండొలిచినట్లువ్రాయును. పారిభాషిక పదముల నతి స్వల్పముగ వినియో గించు విమర్శకులలో ఇలియట్ అగ్రగణ్యుడు. ఇట్లే విమర్శా సాహిత్యమును సుసంపన్న మొనర్చి ఒక సంస్థగా నిర్మించిన విమర్శకు లనేకులున్నారు. విమర్శించుటలో, నవలా కథానికలలో నెన్ని శిల్పములు ప్రయోగింపబడినవో యన్ని శిల్పముల ప్రవేశపెట్టినవిమర్శకులునున్నారు. బిరల్,బీర్‌బాం, లిండ్, లూకాస్, ముర్రేల యభిప్రాయముల స్వీక రించనిదే రచనల నొక కాలమున గుర్తించకుండెడి వారనినచో అచ్చటి విమర్శకుల సత్తా నూహించు కొనవచ్చును.

ఇందరి కృషివలన పాశ్చాత్య పాఠకలోకము నకు కావ్యనాటక సాహిత్యము లంతటి విమర్శా సాహిత్యము సమకూరినది. దీనివలన రెండు లాభములు కలిగినవి. విమర్శించగల పాఠక లోకమున్నదని రచయితలు గుర్తునందుంచుకొనుట యొకటి. రచయిత స్వయముగా తన రచనను లెస్సగా విమర్శించుకొనుచు రూపొందించుట మరి యొకటి. అచ్చటి విమర్శకుల నొక నిర్ణయాధి కారము గల సంస్థగా పరిగణింతురు. వారి ఒక్క తీర్పు వాక్యమువలన రచయిత పుస్తకము బ్రతు కుటో చచ్చుటో జరిగిన నిదర్శనము లెన్ని యేని గలవు. మన సాహిత్యములో నంతటి పేరు దెచ్చు కొనిన విమర్శకులు గాని తమ యభిప్రాయములకై రచయితలు ముద్రాపకులు దేవులాడునట్లు చేసి

కొనిన విలువగల వారుగాని లేరు. కావుననే రచయిత లొకరికొకరు 'తొలిపలుకుల'ను వ్రాసికొని వారిని వీరు, వీరిని వారు పాఠకలోకమునకు సిఫార్సులను జేసికొనుచున్నారు. ఈ దౌర్భాగ్య మంతరించవలెననిన ఉత్తమ విమర్శకుని యవసర మెంతేని యున్నది.

ఆవేశము మమకారములు లేని వినీతస్థితినుండి యథార్థనివేదనమే తన విధిగా భావించు విమర్శ నేడు సాహిత్యావసరమగుచున్నది. విశ్లేషణాత్మకమైన దృష్టి, తులనాత్మకమైన పరిశీలనము విమర్శకు ప్రాణమైనచో విమర్శకుని యథార్థప్రియత్వము ఆత్మవంటిది. కొందఱాధునికులలో నిశితమైన విశ్లేషణాత్మకమైన దృష్టి స్పష్టముగా గనుపించును. కొందఱిలో మొగమోటమి లేకుండ చెప్పెడి గుణమున్నది. ఉత్తమ రచయితలు దీని నెంతయు నభినందింతురు. వారిని రచనావేళలలో పీడించిన యావేశ మొక్కొక్కసారి దోషముల జేయించును. ఈ దోషముల సహృదయుడైన రచయిత, నిష్కర్షగ యథార్థమును జెప్పిన విమర్శకుని ఆదేశమాలించి తనను దిద్దుకొనును. హాప్‌కిన్స్ తనపై వచ్చిన కువిమర్శలనే ఈసడించుకొనక 'ముందు సరిదిద్దుకుందు' ననెనట. ఈ సౌజన్యము మన రచయితలలో నెందరికున్నదో తెలియదు. మీసముల దువ్వి మీదబడెడు రచయిత లున్నప్పుడు "స్వధర్మేనిధనం శ్రేయః" అనగలిగిన విమర్శకు లుండవలయును. విమర్శించిన ఏమికొంప మునుగునో యని ఆత్మరక్షణోపాయముగ సమీక్షా సింహావలోకాదుల జేసి, తుదకు మర్యాదగ 'ఇట్లుండిన మరింత బాగుండెడిదేమో' యని పుక్కిలించినట్లువ్రాసి, నీళ్ళు నములుచున్నట్లు ముగించు దురభ్యాస మంతరించిననేకాని శాశ్వతముగ నిలుచు సాహిత్య సృష్టి కానేరదు. సర్వతోముఖముగ ప్రగతి జరుగుచున్న ఈ కాలమున ఉత్తమ విమర్శకునిపై గురుతరమైన బాధ్యత ఉన్నది. వైజ్ఞానిక రంగమున సత్యనిష్ఠ ఎంత అవసరమో సాహిత్యరంగమున నంత యవసరమని తెలియని కీర్తికాములైన రచయితలు తమ రచనములలో ననేక నవ్యప్రయోగముల జేయుచున్నా మనుకొనుచున్నారు. భాషను మాత్రమే స్వేచ్ఛగా నుపయోగించుచు భావములను శైలినిమాత్ర మనుకరించు రచయిత లెందరో గలరు. ఛందోబంధముల కతీతులమను ఒక దుర్బలతృప్తి వీరి రచనలకు దోహదమగుచున్నది. శ్రీరంగనీతు లెక్కువయిననే కాని శ్రీశ్రీలోని వాగ్బలముగాని పరిభాషాసృజనాత్మకశక్తిగాని ఆధునికులలో లేదని చెప్పవచ్చును. అతని ననుకరించి, పేరుబొందిన ఐదారుగురు కవులు స్వంత వ్యుత్పత్తికంటె తమ కలుపుగోలుతనము వల్లనో కంఠమువల్లనో చమత్కారమువల్లనో వెలుగుచున్నారు. వీరిరచన లిట్లే సాగిన ఆగవు కాని ఏనాటికైన తమ రచనలలో 'జగత్తు' ను సృష్టించుశక్తి వీరికి లేకపోలేదనిపించును. రచనలలో పాఠకునికి ఒక విశిష్టమైన జీవనానుభూతిని గల్పించుటయే 'జగత్త'నబడును. నిత్యజీవితము, ఉత్తమ సాహిత్యమున ప్రతిబింబితమగు జగత్తును రెండు భిన్నములైన అనుభూతులు. కాని సాహిత్యానుభూతిచే పాఠకుడు తన ఏ జీవితానుభూతినో స్మరించి సామ్యము గల్పించుకొనును - ఈ యనుభూతి 'నైమిత్తికము' గాదు. దీని స్థాయీభావము కేవలము భావమందే కాని నిత్యజీవితములోని ప్రయోగదశయందు సంభవముగాదు. ప్రతి ఉత్తమ రచనమందీ జగత్స్వరూప మొక ఆదర్శలక్షణమై యుండును. రామాయణ భారతాదులలో ఈ లక్షణమే వానికి శాశ్వతత్వమిచ్చినది. ఆంధ్రమున విశ్వనాథ సత్యనారాయణగారు తమ రచనలలో సాముదాయికముగ నీ లక్షణమును ప్రతిబింబింపజేయుదురు. ఉత్తమ సాహిత్యకారు "లీ విశిష్ట జగత్స్వరూప" మును దర్శింపజేయుట కనేక రచనలను జేసినను ప్రతి రచనలో ఈ యత్నమొక సూత్రప్రాయముగ నుండును. సాహిత్యకారులనేక రచనలలో సాధించిన ఈ విశిష్టతను శ్రీశ్రీ

తన ఒక్క 'మరో ప్రపంచము'లో సాధించుటయే అతని గొప్పదన మనిపించును - ఇది సాహిత్యములో ఉత్తమ చరమ ప్రక్రియ. ఇది కాల్ రిడ్జి, షెల్లీలు వర్ణించిన ఊహా రమణీయ కేవల భావనాజగత్తువలె జీవితమునకు సుదూర ము గాదు. దీనిని కొందఱు సాహిత్యమును జీవిత మునకు సన్నిహిత మొనరించుచున్నామని భ్రాంతి నొందుటయేకాక ఆ భ్రాంతిని ప్రచార మొనరించు చున్నారు. ఈ భ్రాంతి రచనల సంఖ్య పెరుగు టకు దోహదమిచ్చునుగాని ఉత్తమ వస్తువు నేరు కొని రచనజేయుటకు మాత్రము సామాన్యముగా నాటంకమగుచున్నది. సుస్పష్టమైన ఆదర్శము రచయిత తన రచనకుముందే ఏర్పరచుకొనవలెను గాని కాలక్రమమున దానియంతట అదియే పుట్టు నను కొనగూడదు. ఆదర్శ మొక సుందరమైన దీర్ఘ సమాసమువలెనో అలంకారమువలెనో ధారా జన్యము కాదు.

ఉత్తమసాహిత్య సృష్టికి ప్రస్తుత కాలమెంతయు ననుకూలముగ నున్నది. కళాశాలలో జదువు యువకమేధావులలో వైజ్ఞానిక పురోగతి మఱియు హేతువాదముపై ఆసక్తి మెండుగా గనిపించు చున్నది. వారి భాషాభిమానమెంతయును ఆశా జనకముగా నున్నది. కావున ఉత్తమ విమర్శకును సాహిత్యసృష్టికిని మహావకాశమున్నది. మాతృ దేశము యొక్క సాముదాయిక పురోగతిలో సాహిత్యపురోగతియు నంతర్భాగమే కావున ఈ భారమును సైతము వారు వహించెదరని ఆశింప వచ్చును.

# శేషగిరి

కలువకొలను సదానంద

లడ్డు అంటే అందరికీ యిష్టమే !

మొదటి వుండ మహా ప్రీతికరంగా వుంటుంది.

రెండో వుండ స్వాహాచేయడంలో కూడా అవస్థ ఏమీ వుండదు.

ఓపికవుంటే మూడో వుండకూడా మెల్లమెల్లగా పూర్తి చేయవచ్చు - కాని సంఖ్య క్రమంగా పెరిగిన కొలదీ - వెగటుపుట్టి మొహం మొత్తక మానదు !

అందుకు కారణం - ఎంత మధుర పదార్థమైనా రుచిలో మార్పు లేకపోవడమే !

అటువంటిదే శేషగిరినోరు !

ఆఫీసు పొలిమేరల్లో - దాని వాసనలు గుమాళి స్తూన్న సూచనలు ఎక్కడా కనిపించకపోవడం - ఆశ్చర్యకరమైన విషయమేమీ కాదు.

మహారాజు పంపగా అరుదెంచి, సామంతరాజు గారి కొలువుకూటంలో కాలుమోపి, రావలసిన కప్పాన్ని పరిగ్రహింపనిదే వెనుదిరిగి పోని రాయ బారిలాగా - శుభవార్త చెవిని సోకినవెంటనే పైనున్న సూపర్‌వైజరుగారి ఆపీసుగదిలోకి 'లిఫ్టు' లాగా రివ్వునవెళ్లి, చేతిలోకి వచ్చిన ఎనభై ఒక్క రూపాయల జీతమూ జేబులోకి వెళ్ళగలిగినంత వ్యవధిలోనే, రష్యన్ బాలచంద్రునిలా ఆఫీసు పరి సరాలనుండి అదృశ్యుడై పోయాడు.

డబ్బు వున్నవాడికి దొంగల భయమెక్కువ !

డబ్బువున్నా, లేకపోయినా - శేషగిరికి ఋణ దాతల తొందర ఎక్కువ ! డబ్బు వున్నప్పుడు అతని స్థితి ఎటువంటిదీ అంటే - ఏ ఒక్కటీ త్రోసి పుచ్చరాని నాలుగైదు మేనరికాలున్న పడుచు పిల్లయొక్క తల్లిదండ్రుల విపత్కర పరిస్థితివంటిది.

శత్రువులకు భయపడి పారిపోయి కానల్లో తల దాచుకొనే పరాజితునికి కూడా అంతభయం తగదు. బాకీదారు దెవరైనా అల్లంతదూరాన దృష్టి పథంలో పడితేచాలు - శేషగిరి కాళ్లు వీలైనంత త్వరగా దగ్గరలోనున్న సందులోకి మళ్ళుతాయి. పాండుపుత్రులకైనా సంవత్సరకాలం గడువు అంటూ నిర్ణయించబడింది గానీ - ఈ శేషగిరిగారి అజ్ఞాతవాసానికి పరిమితి ఎంతవరకో ఊహించడం దుస్తరం ! అతని జీవితం, అజ్ఞాతం - రెండూ ఒకే అంతందగ్గర పూర్తి కావలసిందే కాబోలు !

ఎలక్ట్రిసిటీ డిపార్టుమెంటువారి కన్‌స్ట్రక్షన్ ఆఫీసులో శేషగిరి 'సెవెనెఫ్ మేస్త్రీ'! ఆఫీసుతో నా కేమీ సంబంధంలేదు. కాని ఆఫీసుపక్కనే మా యిల్లు. ఆఫీసులోని ఉద్యోగులు కొందరితో సాంగత్యం వుంది. శేషగిరితోడి క్రొత్త పరిచయం పాతదై, అదే స్నేహమై, అతని అంతర్యాన్ని తరచి తరచి చూడడానికి దోహదం చేసింది.

ఈ శేషగిరి ఎవడు ? ... చేపపిల్లకు ఈత నేర్పినవాడు !

అంతేకాదు ! కోతలతో గోతాలు నింపగలడు!

మీరు ప్రారంభించారనుకోండి... "ఆ రాత్రి నడిచివస్తున్నాను ! చిమ్మచీకటి ! ఏదో జంతువు గాండ్రుమన్నది ! గుండెలు బిగబట్టాను ! పులి మీదికి దూకింది ! పిడికిలి బిగించి ముఖంమీద ఒక్క గుద్దు గుద్దాను ! దాని పళ్ళన్నీ రాలిపోయాయి ! అంతే! చచ్చినట్లు వెళ్లిపోయింది !..."

ఇక శేషగిరిదీవంతు !— "ఔనౌను ! అప్పుడు నేనూ అటువేపు వస్తున్నాను ! ఆ పులే గాబోలు నాకూ తటస్థపడ్డది ! పులి పళ్ళు కావలసివచ్చి దాని

నోరు తెఱచి చూద్దునుగదా— మచ్చుకైనా వున్నాయా ?... తర్వాత యింకో పులి దగ్గఱ సంపాదించాను లెండి..."

అతని స్వంతడబ్బా వ్యవహారం నాకూ స్వానుభవం మీదనే తెలిసింది.

ఉద్యోగికి ఒక భూమి అని లేదు.

పదెనిమిది నెలల క్రితం— ఒక మిత్రునికోసం నేను అరగొండకు వెళ్ళడం జరిగింది. అక్కడ పరిచయమైనాడు శేషగిరి.

గండుపిల్లి మొహంలాంటి మొహం, ముంత మామిడిపండులా మెలిదిరిగిన గడ్డం, తెల్లటి కనులు, ఒత్తైన కనుబొమలు, నుదుటిమీద పావలా కాసంత చందనపుబొట్టు, కళ్ళకు చత్వారపు టద్దాలు, పొట్టిమెడ, ముందరికితోసుకొచ్చిన చిన్న బొజ్జ, పుష్టిగా వున్న కాళ్ళుచేతులూ— ఒక్క తొండం మినహా— తతిమ్మా అవయవాల నెలవు చూస్తే సాక్షాత్తూ ఆ హ్రస్వాకారుడే!

అతని పొట్టి క్రాపులో, హిట్లరు మీసాల్లో— అక్కడక్కడ కొన్ని వెంట్రుకలు నెఱసివున్నాయి. వయస్సు దాదాపు నలభై ఏండ్లు వుంటాయి.

చాలీచాలని ఖాకీ నిక్కరు, అరచేతుల అమెరికన్ జాకెట్ మీద వేస్టుకోటుతో కనిపించాడారోజు.

మనిషిని చూస్తే— యౌవనంలో మంచి సుందరుడేనేమో ననిపించింది.

ఇతను ఏ యిన్స్పెక్టరో, లేక ఆఫీసరు హోదా వున్న మరే యితరవుద్యోగియో అనుకున్న నేను— ఎలక్ట్రిసిటీ డిపార్టుమెంటులో అతను సామాన్య వుద్యోగిఅని వినగానే—పొందిన ఆశ్చర్యం అంతా యింతా కాదు.

అతని వాక్ప్రౌఢికి ముగ్ధుడనైపోయాను.

అతనలా వెళ్లిపోయాక— మిత్రుడు నన్ను హెచ్చరించాడు— "అబ్బాయీ! నువ్వు అర్భకుడివి! లోకంపోకడ తెలియనివాడివి. జీవితానుభవం లేనివాడివి! ఎవరెవరి దగ్గఱ ఏఏ విధంగా మసలుకోవాలో నేర్చుకో! వేషభాషలు చూసి మోసపోబోకు!..."

ప్రబోధ రూపంలో వెలువడుతోన్న అతని పాత నీతులను పూర్తిగానైనా వినిపించుకోకుండా— "ఇప్పుడు నువ్వుచెబుతూన్నది ఎవరికథ? ఏమికథ? అదేమిటో వివరంగా చెప్పరాదట్రా అన్నయ్యా!" అన్నాను బుర్రకథలో వంతపాటగాడిలాగా.

"అతనే! ఆ శేషగిరే! ఎవరినుదురు విశాలంగా వుంటుందా—అని వెతుకుతూవుంటాడు..."

"ఎందుకు ?"

"ఎందుకేమిటి? పంగనామాలు పెట్టేందుకు!"

"అంటే— నెత్తిన చెయ్యిపెట్టే రకమంటావా ?"

"భంటాపథంగా అంటాను! నేనేకాదు! అతన్ని ఎరిగివున్న ప్రతిఒక్కడూఅంటాడు. అందరూ అన్నానికి మొహంవాచి చస్తారుగానీ— అప్పులకు మొహంవాచిపోయే మనిషిని నేనెక్కడా చూడలేదు. మనమంతా అన్నం తిని కడుపు నింపుకుంటాము. అన్నంతో కడుపు నిండకపోవటానికి యితడు ఏ మానవేతరుడో అనుకుందామా- మానవేతరుడైననారదుడు ఎలా గడుపుకుంటున్నాడు ? వాడి జుట్టు వీడికి, వీడి జుట్టు వాడికి ముడిపెట్టి బ్రేవుమంటాడు. ఈశేషగిరి అటూ లేక యిటూ లేక ఋణయోగంతోనే బ్రతగ్గలుగుతూన్నాడు. ముందు ముందు యిటువంటి మహనీయులు ఉద్భవించగలరనే గాబోలు- ఋణం అన్న పదం భువిని అవతరించింది!"

"ఛా! మాటల్ని బట్టి చూస్తే ఎంతో మర్యాదస్థుడిలా అగుపిస్తున్నాడూ..."

"మాటలకేం- మహాసముద్రాల్నే దాటేస్తున్నయ్ ఈ రోజుల్లో. అతని నోరువుంది చూశావూ- వరప్రసాదమనవచ్చు. కోట్లతో సాధించలేనిదాన్ని నోటితో సాధించేస్తాడు. పని సాధించుకునేందుకు- సాలెగూడులాంటి అందమైన వ్యూహం ఒకటి అప్పటికప్పుడు నిర్మించేస్తాడు. దాంట్లో ఏ దౌర్భాగ్యపు ఈగో తగులుకొన్నదా- యిక సాలెపురుగు వాతబడటం తథ్యం. క్రొత్తవాడెవడైనా తప్ప

కుండా బోల్తాపడిపోతారు. నావంటివాడికికూడా బురఖా పెట్టాడంటే చెప్పుకోడానికి నాకెంతో సిగ్గుగా వుంది. ఆ మధ్య నావి రెండు కథ లొచ్చాయి చూడూ వారపత్రికలో- ఆ సందర్భాన్ని పురస్కరించుకొని నాతో సాహిత్యచర్చలాంటిది ప్రారంభించాడు. తాసూ రాశాట్ట ఏదో నవల. దానిపేరు 'అయ్యో'ట. కథ చెబుతాను చూడండి అంటూ మొదలెట్టాడు. ఏదో దేవాలయంలో ఉత్సవం జరుగుతోందట! ఒక పదహారేళ్ల బాలాకుమారి-యౌవనంలో వున్న ఒక యువకుడి దృష్టిలో పడిందట! ఆమెను ఒక తావు కాగితానికి సరిపోయేంత దీర్ఘంగా వర్ణించాడులే! రివాజు ప్రకారం ఆ యువకుడు తనహృదయాన్ని ఎక్కడో జారవిడుచుకున్నాట్ట! అతను కిటకిటలాడే జనసమూహంలోకి చొచ్చుకుపోయి, పళ్లెరంలో పూజాద్రవ్యాలతో ఒయ్యారంగా నడిచిపోతున్న ఆ మదగజగమనను తనబాహుపంజరంలో బిగియారబంధించుకొన్నాట్ట అలా బంధించినవాడు కథకు కాబోయే నాయకుడు అని తెలిసివుంటే ఆ అమ్మాయి నోరైనా మెదిపి వుండేది కాదు. కాని ఆమెకు అది తెలియదు. అందుచేత 'అయ్యో' అన్న ఆర్తనాదం ఒకటి చేసిందట. ఆ 'అయ్యో' మన్న ఆర్తనాదంచుట్టూ పరిభ్రమిస్తూ నవల సాగిపోయి ఆఖరుపేజీలో ఆగిపోతుందట! ఆ తర్వాత ఏదో కథ చెప్పాడులే- పెళ్లంట, పెద్ద చదువులట, విదేశాలట, పాశ్చాత్య ప్రణయ విధానాలు, స్వదేశాగమనం, విడాకులు - యింకా ఏవేవో ప్రకరణాలు బోలెడున్నాయి. కథయావత్తూ చెప్పి, 'ఎలా వుందండీ?' అన్నాడు. అదివరకు నేనెప్పుడూ విడిచివుండని దీర్ఘమైన నిట్టూర్పు ఒకటి విడిచి "మీ 'అయ్యో' అన్న నవల పాఠకులచేత 'అయ్యో' అనిపింపజేసేట్టుగానే వుంది!" అన్నాను. ఆ కథ నన్ను రాయమన్నాడు. నాచేత రాయబడితే ఆ నవల పావనమౌతుందట! 'మీ రిదివరకే రాశానన్నారు గదండీ!' అన్నాను. 'రాశానండీ! అది-పోయింది! నేను మిలిటరీలోవున్నప్పుడు స్టీమరులో పోతుంటే ఎక్కడో నీళ్ళల్లో పడిపోయింది. సరిగ్గా వెయ్యిపుటలు రాశాను. మీరు రాస్తే యింకా పెంచి వ్రాయగలరు: నాకు నమ్మకముంది!' అని చెప్పి, నాకు సేదదీర్చడాని కన్నట్లు- వొద్దంటున్నా వినక బలవంతంగా లాక్కెళ్ళి తనకు కాతా వున్న హోటలులో ఒక టీ త్రాగించాడు. తర్వాత యింకో అరగంట కల్లా - 'రెండు రూపాయలుంటే యివ్వండి. పర్సు యింటిలో మరిచిపోయి వచ్చేశాను. మళ్ళీ యింటికి వెళ్ళినప్పుడు యిస్తాను' అన్నాడు - తన గౌరవానికి దెబ్బతగలనివిధంగా. ఇతని వ్యవహారం నాకప్పుడేం తెలుసు?—సరే— మళ్ళీ యిచ్చేస్తాడుగదా అని యిచ్చాను. ఇంకా త్రిప్పి యిస్తూనే వున్నాడు."

తన స్వానుభవాన్ని యథాతథంగా వివరించాడు మిత్రుడు.

తరువాత అతను ఒక చిల్లరదుకాణంకేసి దారి తీశాడు. నేనూ అనుసరించాను.

ఒక పళ్ళపొడిపొట్లం తీసుకొని వెనుదిరగడంతో "అదేమిటీ? టూత్ పేస్టు వాడేవాడివి కదానువ్వు?" అన్నాను. అతను నవ్వి, "నేను దీన్ని రొక్కమిచ్చి తీసుకోవడం లేదని నువ్వు గుర్తించాలి. తాహతుకు మించిన అప్పు చేయడం మనవల్లకాదు. జీతం రావడానికింకా ఎన్నాళ్ళుందిలే_అప్పుడు చూసుకోవచ్చు" అన్నాడు.

అతని గదికి తిరిగి వస్తూంటే మార్గమధ్యంలో చిల్లరకొట్టు యజమాని ప్రసక్తి వచ్చింది.

ఇదివరకు నేనతన్ని కొట్టులో చూసివున్నాను. మంచి స్థూలకాయుడు. లావుకు తగిన ఎత్తు. నానవేసిన అనపగింజలా బూదర మొహం. సంప్రదాయానుసారంగా వున్న బొజ్జ, నెత్తిమీద ఎర్ర నామం, తామ్రవర్ణం, నోటినిండుగా తమలం, బొజ్జమీదుగా బిగియగట్టిన ధోవతి, అరచేతుల చొక్కా, నేను చూసినప్పటి వ్యక్తి చిత్రణ.

మిత్రుని నోటిద్వారా విన్నది, అతని పేరు నాగరాజుశెట్టి. కల్లాకపటంలేని మనిషి. మృదు

ఖాపి. అతని వృత్తికి విరుద్ధమైనటువంటి జాలిగుండె నలభై అయిదు రూపాయల జీతగాడికి అరవై రూపాలయవరకు సామగ్రు లివ్వగలడు. బాకీ తీర్చడం ఆలస్యమైతే వెనువెంటనే నెత్తినెక్కి కూర్చోడు. "తొందర చేయడం దేనికి ? తీసుకున్న వాడు నిదానం మీదటనైనా యివ్వకపోతాడా ?" అన్న నిబ్బరం వున్నవాడు. "మా నాగరాజయ్య మా కులంలో పుట్టివుండవలసినవాడే కాదు!" అని ఒక వైశ్యుడే అన్నాట్ట! ఈ నాగరాజు శెట్టిని గురించి ఎందుకు చెబుతున్నానంటే మన శేషగిరి కథలో యితనికికూడా ఒక ముఖ్యమైనపాత్రేవుంది.

అరగొండలో నేనున్న మూడు రోజుల్లోనూ, శేషగిరిని గురించి చాలవరకు తెలుసుకున్నాను. అతనికథ అక్కడి వారందరికీ ఒక కాలక్షేపం వంటిది. అందుచేత మన ప్రయత్నం అవసరంలేదు. తీగెను కదిలిస్తేచాలు, డొంక డొంకంతా కదులుతుంది.

ఇంగ్లీషు, తెలుగు, తమిళం, కన్నడం, హిందీ- ఈ అయిదు భాషలూ ధారావాహంగా మాట్లాడగలడు శేషగిరి. అతని సంభాషణలో ముప్పాతిక వంతు యింగ్లీషు దొర్లిపోతుంటుంది. పైపై గొప్పలకు బాగా అలవాటుపడినవాడు. అందుకే— బురదలో మునుగుతూ మునుగుతూ—పన్నీరు, అగరువత్తులు మొదలైనటువంటి సుగంధ ద్రవ్యాల్లోని రకాలను గురించి చెప్పడం అతనికి అప్రస్తుతంగా అనిపించదు. ప్రతి విషయమూ తనకు తెలిసినంత కూలంకషంగా మరెవ్వడికీ తెలియదు అనిపించుకునే విధంగా మాట్లాడ్డానికి చాలా ప్రయత్నిస్తాడు.

శేషగిరి ఏమహారణ్యాల్లోనో - వన్యమృగంగా పుట్టివుండవలసినవాడు ! ఎందుకంటే— అతనికి కుటుంబవ్యవహారాలు, భార్యా బిడ్డల అవసరాలు, భవిష్యత్తునుగురించిన ఆలోచన, దూరదృష్టి - వీటిని గూర్చిన ధ్యాసేలేదు. అందుకే భార్యవున్నా బ్రహ్మచారిలాగా, బిడ్డలున్నా సంతానహీనుడిగా, సంసారమున్నా సన్యాసిగా వ్యవహరిస్తూ వుంటాడు. ఇటువంటి వ్యక్తి వన్యమృగంగా కాక మరేంగా పుట్టాలి ?

అతని స్వస్థలం తిరుపతి. అతనికి ముప్ఫయేళ్ళ భార్యవుంది. ఒక కొడుకు, ఒక కూతురు వున్నారు. కొడుకు వయస్సు పన్నెండేళ్ళు, కూతురి వయస్సు నాలుగేండ్లు. హైస్కూలులో చదువుకుంటూ వుండవలసిన వయస్సు - కొడుకుది. కాని వాడు చదువుకోవడంలేదు. ఒక వేళ చదువుకొని వుంటే అది అయిదోతరగతి వరకు మాత్రమే! వాడు వంట బాగా చేయగలడు. వంటలో వాడికి నలభీమపాండిత్యం వుంది. అది సిద్ధించడానికి కారణం— శేషగిరిభార్య అప్పుడప్పుడూ అలిగి కూతురితోబాటు పుట్టినింటికివెళ్ళిపోతూ వుండడం. అటువంటి పరిస్థితుల్లో - పొయ్యిదగ్గరవని కొడుకు పాలబడుతూ వుంటుంది. ఇది శేషగిరికి చాలా వీలుగానూ, సహాయకారిగానూ వుంటుంది.

అతనికి-వూళ్ళోవున్న రెండు మూడు హోటళ్ళలోను, మిగతా దుకాణాలన్నింటిలోనూ ఖాతాలున్నాయి. అతనికి పరిచితుడన్న ప్రతి ఒక్కడూ అతన్ని మరచిపోలేడు. వారి జేబులో ఉండే నోటుబుక్కులో ఫలానా తేదీన ఎంతో కొంత రొఖ్ఖం అప్పుగా తీసుకున్నట్టు శేషగిరిపేరు వుంటుంది.

ఇచ్చే నాథుడుండాలేగాని - అప్పుచేయడానికి ఏ మాత్రం జంకడు. ఏదో ఒక హోటలులో అరడజను యిడ్లీలు, అరడజను వడలు తింటూ కనిపించాడనుకోండి; ఆ తర్వాత వేడివేడి పాలు ఒగ్లాసెడు వూది వూదీ తాగేశాడనుకోండి - ఇక ఆ హోటలు యజమానిగారి బల్లమీది ఖాతా పుస్తకంలో ఒక పేజీ శేషగిరి కోసం ప్రత్యేకింపబడి వుంటుందన్న విషయం నిర్వివాదాంశం!

గౌరవం పోగొట్టుకుంటే ప్రాణంపోగొట్టుకున్నట్టే - అన్నాడట ఒక కవి. శేషగిరి చెవిలో ప్రబోధగీతం పాడిపాడి, అతనిలో చైతన్యం తేలేక ఆసూక్తివిసిగి వూరుకోవలసిందే! చిన్నా-పెద్దా,

గౌరవనీయుడు-గౌరవహీనుడు - ఇటువంటి పదాలన్నీ అతని దృష్టిలో సర్వసమానత్వాన్ని చూరగొంటాయి.

తనకన్నా తక్కువవాడితోను కూడా అతి వినయంగా, మూర్తీభవించిన శాంతస్వభావంలా మాట్లాడతాడు. ఆవిధానంలో అతనికి ఒక లాభం వుంది !...

వినయం అజ్ఞకన్నా గొప్పది !

'ఎస్ ! ప్రామిస్!' అన్నది అతని వూతపదం!

ఎన్ని యిక్కట్టులున్నా-పెదవుల మీద చిరునవ్వుతో కనిపిస్తాడు.

ఇదీ శేషగిరిని గురించిన భోగట్టా !

ఒకవ్యక్తియొక్క మనస్తత్వం, ప్రవర్తనా కొంత పరిధిని అతిక్రమించివుంటాయి. కానీ - యీ శేషగిరిని గురించి చెప్పేటప్పుడు అటువంటి పరిధి ఎక్కడా అడ్డు తగలదు !

అప్పటికి అతను తన్నుగురించి తాను లేవదీసిన పుకారు ఏమిటంటే - తనకు అతిత్వరలో ప్రమోషన్ రాబోతుందని. ఈ పుకారువల్ల అతనికి ఒరిగేదేమిటంటే - అప్పులవాళ్ళ బాధ ప్రస్తుతానికి ఉపశమించడం.

అతనివయస్సులో నా వయస్సు సగంకూడా వుండదు. విచిత్రమేమంటే - నేనక్కడున్న అతి స్వల్పకాలంలోనే అతను నాతో ఏర్పరచుకొన్న స్నేహం కొన్ని సంవత్సరాలను అధిగమించిన స్నేహం లాంటిది !

అక్కడినుండి నేను తిరిగివస్తూ బస్సెక్కినప్పుడు అతడు ప్రాణమిత్రుడికిమల్లే నాకు వీడ్కోలు యిచ్చాడు. "మరచిపోకండోయ్ ! అప్పుడప్పుడూ వచ్చిపోతుండండి !" అంటూ చేయి వూపుతూ కేకలు వేశాడు.

ఆ తరువాత మరి రెండుసార్లు అరగొండకు వెళ్ళిరావడం జరిగింది. అనుభవంమీదట శేషగిరి మాటలధోరణి నాకు పాత చింతకాయపచ్చడి వంటిదై పోయింది. అతని స్నేహం భరింపరానిదై పోయింది. ఒకచేత అక్షయపాత్ర పట్టుకొని, రెండవచేత్తో శంఖనాదం చేస్తూ యింటిముందు నిలబడ్డ సాధువుమీదకూడా నాకు అంతటి విసుగు పుట్టివుండలేదు !

ఓ రోజు మధ్యాహ్నం అనుకోనివిధంగా, హఠాత్తుగా వచ్చిన వర్షంలా యింటి గడపలో అతనికంఠం మ్రోగింది. అతని ఆగమనానికి నేను తత్తరపడ్డాను. మర్యాదఅంటే ఏమిటో తెలిసి వున్న వాడినవడంచేత నా అయిష్టతను పైకి కనబడనీయకుండా చిరునవ్వు నవ్వుతూ "మీరా ? రండి రండి ! కూర్చోండి ! ఎప్పుడొచ్చారు ? ఏలా వున్నారు ?" అన్నాను.

"ఏదో మీబోటివారిదయ !" అంటూ తెరలు తెరలుగా నవ్వాడు.

"మంచినీళ్ళు పుచ్చుకుంటారా ?"

"థాంక్స్ ! ఒక స్నేహితుడి యింటికి వెడితే చెంబునిండాపాలు యిచ్చారు. ఇంకోస్నేహితుడి కోసం వెడితే గ్లాసెడు మజ్జిగ తెచ్చి తాగమని బలవంతం చేశారు. మొగమోటమి వల్ల అదీ పుచ్చుకొని వస్తున్నా..." శేషగిరి సందర్భోచితంగా అబద్ధాలుగూడా ఆడగలడు.

"ఎప్పుడూలేనిది మావూరికి క్రొత్తగా వచ్చారేమిటీ యివాళ ?..."

"ఈపాకాల నాకు క్రొత్తేమిటయ్యా ? నాకు బుద్ధి తెలిశాక ఎన్నిసార్లు వచ్చాను, ఎన్నిసార్లు పోయాను ! ఈవూళ్ళో చాలామంది నాకు తెలుసునే ! కాస్త పనివుండివచ్చి, ఆలాగేమిమ్మల్ని కలుసుకుని మాట్లాడి పోదామని వచ్చాను."

"ఏమున్నాయండి విశేషాలు ?"

"మీ మిత్రుడు మిమ్మల్ని అడగమన్నాడు... ఈ యిల్లు స్వంతమేనా?"

"కాదండీ ! అద్దెది !"

"అద్దదీ ! నేనప్పుడే అనుకున్నా ! స్వంతమైతే యిలా వుండదు.... కిటికీలు ఎక్కువగా వుండాలండీ ! యిల్లుకూడా చిన్నదే !"

"ఏదోలెండి! ఎంతయింటికి అంతగాలి!"

తర్వాత ఏదేదో ఊకదంపుడుసంభాషణ జరిగింది.

"అన్నట్టు— యిప్పుడు నేను అరగొండ వెదుతున్నాను. చిత్తూరుకు రైలు ఎన్నిగంటలకు?" అన్నాడు శేషగిరి.

"టైము అయిపోవచ్చిందండీ! యిప్పుడు ఒంటిగంటకు వున్నది!"—ఈ పీడను త్వరగా వదిలించుకోవాలన్న తపన నాలో ఆవిర్లు గ్రక్కుతోంది.

"అయితే యిక వస్తానండీ! నమస్కారం! ఈ మీ మిత్రుడిపైన మీ కరుణ ఎప్పటికీ వుంటే అంతే చాలు!" అంటూవుండగానే— అతన్ని సాగనంపడానికి పైకి లేచాను.

వీపుమీది జోరీగను తోకతో ఎంత తోలుకున్నా అది అటు ఎగిరి యిటు ఎగిరి మళ్ళీ ఎక్కడో యింకో చోట వాలుతుంది.

వెళ్ళిపోయాడనుకున్న శేషగిరి అటుతిరిగి యిటు తిరిగి, సాయంకాలానికి మళ్ళీ యింటిముందు ప్రత్యక్షమయ్యాడు.

నా గుండెల్లో మళ్ళీ పిడుగుపడింది.

"ఏమండీ? మధ్యాహ్నం రైలేమన్నా తప్పిపోయిందా?"

ఇంగ్లీషులో మొదలెట్టాడు శేషగిరి. దానికి తెలుగు తాత్పర్య మిది: "చూడండీ! నాకిప్పుడు రెండు రూపాయలతో చాలా అవసరముంది. ఈ అవసరం తీర్చారంటే నాకు మీ రెంతో సహాయం చేసినవారౌతారు. మీకు కలకాలం ఋణపడి వుంటాను. మధ్యాహ్నమే వెళ్ళిపోయివుండేవాడ్ని! టిక్కెట్టు తీసుకోకపోతే చాలా యిబ్బంది పడవలసి వస్తుందని ఆగిపోయాను. మధ్యాహ్నం ఏం జరిగిందంటే - టిక్కెట్టు తీసుకుందామని బుకింగుఆఫీసు దగ్గరి కెళ్ళి, చాలా రద్దీగా వుంటే అక్కడ నిలబడ్డాను. నా చొక్కా జేబులో అయిదురూపాయల నోటు వుంది. అది సగంవరకు పైకి కనుపిస్తూనే వుంది. ఎవడోనండి- పొట్టిగానూ, బక్కపలచగా వున్నాడు. చిరిగిపోయిన బట్టలు తొడుక్కున్నాడు. వాడి తల రేగిపోయివుంది. వాడిమొహం చూడగానే అనుకొన్నాను. వాడేంచేశాడూ- సాముందు నుండి నన్ను రాచుకుంటూ అటువెళ్లాడండీ! అంతే, నా జేబులోని ఒక్కగా నొక్కనోటు వాడితోపాటే మాయమైపోయింది...దొంగవెధవ! నాకు తెలుసునండీ యిలాంటి దొంగవెధవ లుంటారని..."

"తెలిసి తెలిసీ గోతిలో ఎలా పడ్డారండీ?" అన్నాను వ్యంగ్యం ధ్వనిస్తూన్న గొంతుతో.

"అదే మరి! గ్రహచారం తప్పించడం ఎవరితరమయ్యా?... టిక్కెట్టు లేకపోయినా ఫరవాలేదు. వెళ్ళిపోయివుండేవాడిని. టిక్కెట్టు ఎగ్జామినర్లందరూ నాకు తెలిసిన వాళ్ళే! అయినా అదేమంత బాగుంటుంది చెప్పండి?....ఒక స్నేహితుడ్ని రెండు రూపాయలడిగాను. సమయానికి అతని దగ్గఱ లేకపోవడంచేత అతను చాలా నొచ్చుకున్నాడు. వెంటనే తనవ్రేలికివున్న బంగారపుటుంగరంతీసి "శేషగిరిగారూ! మరేమనుకోకండి. ఈ స్వల్పసహాయం చేయడానికి యింతకన్నా మార్గంలేదునాకు. ఇదిగో! యీ వుంగరం ఎక్కడన్నా అమ్మో, తాకట్టుపెట్టో డబ్బు సరిపెట్టుకోండి!' అంటూ బలవంతంచేశాడు. నిజంగా నాకు మనసొప్పిందికాదు. అందుచేత అతన్ని ఆప్రయత్నం నుండి అతి ప్రయాసమీద విరమింపజేసి 'అయ్యో! ఫరవాలేదులే! నాకు స్నేహితులు చాలామంది వున్నారు. ఎవరో ఒకరు ఒద్దన్నా యిస్తారులెండి!' అని అతన్ని పంపించేసి యిటువస్తున్నాను. రేపుదయానికల్లా ఆఫీసులో వుండాలి. నేను లేకపోతే అక్కడ చాలా పనులు నిలిచిపోతాయి. ఒక రెండు రూపాయలకన్నా ఎక్కువవద్దు!

ఇల్లు ప్రతిధ్వనిస్తుంటే - యింట్లో వాళ్ళేమనుకుంటారోనని భయపడ్డాను. "చూడండి శేషగిరిగారూ! మిమ్మల్ని పూర్తిగా ఆదుకోలేక పోయినందుకు నాకు చాలా సంతాపంగా వుంది. నా దగ్గర ఒక్కటే ఒక్క రూపాయి వుంది. దీంతో సరిపెట్టుకోండి!" అంటూ ఒక్క రూపాయితో అతన్ని

వదిలించుకున్నాను. ఆ ఒక్కరూపాయి - దమ్మిడీ మిగలకుండా అతని చార్జీలకు సరిపోగలదు.

బావిలో పడ్డవాడికి గడ్డిపోచ దొరికినంత తృప్తితో అతను వెళ్ళిపోయాడు.

నెలరోజుల తర్వాత ఓసారికనిపించాడు. ఆనాటి నుండీ అతని దర్శనం నిత్యదర్శనం! ఏమంటే-అతను పాకాలకు బదిలీ అయిపోయాడు. ఇది జరిగి దాదాపు మూడు నెలలు కావస్తోంది.

అతను వచ్చీరాగానే సామాన్య గృహాలనడుమ నిలువడానికి సీడ వెతుక్కున్నాడు. దాన్ని గదీ అనలేము; సంసారానికి అనువైన యిల్లూ అనలేము. శేషగిరి అందులో ఒంటరిగానైనా వుండవచ్చు; భార్య కటాక్ష వీక్షణాలు సోకినప్పుడు ఓమూల పొయ్యికూడా రాజేసుకోవచ్చు. పడుకుంటే గోడకు కాళ్లు తన్నుకుంటాయి.

అతను బదిలీ అయి పాకాలకు వచ్చిననాడు— అతని భార్యాపిల్లలు అరగొండలోనే వున్నారు. పదిహేను రోజుల తర్వాత— వచ్చినవారు వచ్చినట్లే—వట్టుమని పదిరోజులైనా కాకుండానే తిరుపతికి వెళ్ళిపోయారు. హోటలు తిండ్లకు అలవాటు పడిన శేషగిరి నాలుకకు అంతకన్నా కావలసిందేముంది?...

అతని ఆకారం, ఠీవి, సంభాషణ రీతి చూసి అతనికి అప్పులివ్వడానికి ఏ అంగడివాడూ నిరాకరించడు. ఎవడికి అనువుగా ఏ మాటలు మాట్లాడాలో, శేషగిరికి బాగా తెలుసు. అత్యవసర సమయాల్లో అది అతన్ని ఆదుకుంటుంది. ఆ నోటి ఆకర్షణే ముందు ముందు తన కొంప ముంచగలదన్న విషయం అతనికి తెలియదు.

ఈ మూడు మాసాల్లో ఋణదేవత అతని గళసీమను అలంకరించిన పూలమాలలు అసంఖ్యాకం!

ఇంకా చెప్పుకోదగ్గ కృష్ణలీలలుకూడా కొన్ని వున్నై!...

మచ్చుకు—

ఒకటి—ఒక టైలరును క్రొత్తగా పరిచయం చేసుకుని 'లీలా' ఫ్యాన్సీ స్టోర్సులో ఒక గొడుగు, కాళ్ళకు చెప్పులు, ఒక టార్చిలైటు, సోపులూ అవీ యివీ అంతా కలిసి పాతిక రూపాయల వస్తువులు అప్పుతీసుకోవడం. ఇవన్నీ తీసుకోవాలని అతను ముందు అనుకోలేదు. కాళ్ళకు చెప్పులు మాత్రం కావలసివచ్చాయి. షాపు ఆసామీ అనుకూలుడుగా కనిపించగానే - ఎరవలిగుర్రాన్ని తంగేడుబద్దతో వాయించగలిగినంత వరకు వాయించేశాడు!

రెండు-తన కొడుక్కు చాలా అపాయంగా వుంది; చచ్చేపరిస్థితుల్లో వున్నాడు; మందు కొనుక్కోడానికి చేత చిల్లిగవ్వలేదు. అనిచెప్పి ముఖంలోని దిగులును భూతద్దం పెట్టిచూపి, ఫోర్ మేన్ దగ్గర-అంటే తనపై ఉద్యోగినుండి అయిదురూపాయల నగదు అరువుగా తీసుకుపోవడం.

ఆ తరువాత ఫోర్ మేన్, తదితరులూ "అయ్యో! మన శేషగిరి యింత ఆర్భాటం చేసిపోయాడే, అతని కొడుక్కు ఎలావుందో చూసివద్దాం పాపం!" అనుకొని వెళ్ళి చూస్తే- ఆ యింట్లో అతనుతప్ప మరెవ్వరూ లేనట్లు తేలింది.

మూడు-నందగోపాల్ శెట్టి క్రొత్తగా పెట్టిన బట్టలకొట్లో-తాను సూపర్ వైజరుననీ, వున్నట్టుండి యీ వూరికి బదిలీ కావడం వల్లా, వూరికి తాను క్రొత్తవాడవటంవల్లా తన్ను తానుగా పరిచయం చేసుకోవలసి వచ్చిందనీ చెప్పి, నలభైరూపాయల బట్టలుతీసుకుని జీతం రాగానే డబ్బు బంట్రోతుచేత యిచ్చి పంపుతానని చెప్పి చల్లగా జారుకోవడం.

ఆ మరునాడు వెంకటసామి అనే లైన్ మేన్ ఆ బట్టల కొట్టుకు వెళ్ళినప్పుడు "అయ్యా! మీ కొత్త సూపర్వైజరుకూడా నిన్న- జీతంరాగానే యిస్తాననిచెప్పి నలభై రూపాయల బట్టలు పట్టుకెళ్ళాడు." అని చెప్పాడు నందగోపాల్ శెట్టి. వెంకటసామి అన్నాట్ట-"మాసూపర్వైజరు వూళ్ళో ఎక్కడున్నాడు? రేణిగుంటకు క్యాంపువెళ్ళి

అయిదు రోజులవుతున్నై. రేపో, ఎల్లుండో గానీ రాడు!"

అది విని నందగోపాల్ శెట్టి "కాదయ్యా!" అని బల్లగుద్ది అతగాడి రూపురేఖా విలాసాదులను వర్ణించాట్ట!

అసలు సంగతి అర్థంచేసుకున్న వెంకటసామి "బోల్తాకొట్టిందిలే బుల్ బుల్ పిట్ట" అంటూ ఏదో సినిమాపాటలోని చరణాన్ని రెండుమూడు సార్లు రాగయుక్తంగా వల్లించి, శెట్టిచేత అయిదు నిమిషాలపాటు బ్రతిమాలించుకుని "అయ్యా! వచ్చిన వాడు ఫల్గుణుడు!" అని జరిగిన మోసం వివరించి చెప్పగానే నందగోపాల్ శెట్టిగారిబుర్ర ఆశ్చర్యంతో దిమ్మెక్కిపోయి, నవ్వాలో ఏడవాలో తోచక, కాస్సేపు నవ్వి, కాసేపు తలపట్టుకొన్నాట్ట!

ఈ మచ్చు తునకలన్నీ ఒక తరగని రాశి!

ఊరు ఒకరిదికాదు. వీథి అని ఒకటుంటే- అందులో నడిచి పోవడానికి ప్రతిఒక్కడూ స్వతంత్రుడు. ఆస్వాతంత్ర్యం శేషగిరికి లేదు. అతనికి ఒక కట్టడివుంది. ఆకట్టడి చేజేతులా అతను ఏర్పరచుకొన్నదే! ఎక్కడైతే శేషగిరి చక్కగా నిలబడి నడుస్తాడో, ఎక్కడైతే అతని గొంతుక పెద్దగా ధ్వనిస్తుందో ఆచోట్లో అతనికి అప్పులవాళ్ళులేనట్లే! అయితే అటువంటి ప్రదేశాలు అరుదు!

అరగొండలో శేషగిరిని గురించి ఉద్ఘాటించిన మిత్రుడు యిటీవల వచ్చివుంటె అతనిద్వారా మరో క్రొత్తకథ తెలిసింది.

అరగొండలో అతనికి తలమునకలయ్యేటువంటి అప్పులున్నాయట! ఇంటి యజమానికి యింటిఅద్దె, అప్పుడప్పుడు చేబదులుగా తీసుకొన్న డబ్బు కలిపి వందరూపాయలివ్వాలట! ఒక బట్టల కొట్టులో ముప్పైఅయిదురూపాయలివ్వాలట! ఒక హోటలులో పాతికరూపాయలివ్వాలట! చిల్లరకొట్టు నాగరాజు శెట్టికి అరవైరూపాయలివ్వాలట!... మిగతా చిల్లర బాకీలకు ఒకలెక్క అంటూలేదు.

శేషగిరికి బదిలీ అయినసంగతి పిట్టకైనా తెలియదు! భార్యాబిడ్డలను అక్కడే విడిచి, వస్తూ వస్తూ- అందరితో "నాకు పాకాలలో పన్నెండు రోజుల క్యాంపువుంది. క్యాంపు అయిపోగానే వచ్చేస్తాను." అని చెప్పాట్ట.

ప్రత్యేకంగా నాగరాజు శెట్టి దగ్గరికి వెళ్ళి, పైమాటలనే వల్లించి- నేనులేకున్నా ఫరవాలేదు. నేను తిరిగి వచ్చేంత వరకు యింట్లో వాళ్ళకు ఏమేమి అవసరమో అవన్నీయిస్తూ-ఎప్పటికప్పుడు లెక్క వ్రాసుకుంటూవుండండి. నేను మళ్ళీ రాగానే పైకం యిచ్చేస్తాను." అని చెప్పాడు. నాగరాజు శెట్టి వద్దులో అదివరకేవున్న బాకీ ముప్పై. అతను వచ్చేసిన తరువాత పదిహేనురోజులపర్యంతం అతని కుటుంబం చేసినబాకీ మరో ముప్పై. పదహారో నాటి ఉదయం శేషగిరిపెళ్ళాంపిల్లలు అరగొండలో లేరు! అతని యిల్లు తాళంవేసి వున్నది!

ఆలుమగల ఆంతరంగిక రహస్యం ఆనాటికి బయటపడింది!

బాకీదార్లందరూ శేషగిరికి ఉత్తరాలు వ్రాశారు. అలా కుప్పలు తెప్పలుగా వచ్చిన వుత్తరాల్లో నాగరాజుశెట్టి వ్రాసినవికూడా వున్నాయి.

శేషగిరి వారి కోరికలను మన్నించలేదు. సరికదా మన్నించగలిగినట్లు బదులైనా వ్రాయలేదు.

నాగరాజుశెట్టి సరాసరి యీ వూరికివచ్చి, పొద మాటున దాగిన వేటకానిలా రెండు రోజుల్నుంచీ పొంచి వున్నాడన్న సంగతి శేషగిరికి తెలియదు.

నాగరాజు శెట్టి నిన్న ఉదయం బజారులో కనిపించాడు నాకు. అతనితో నాకు ఎక్కువపరిచయం లేకపోయినా "ఏమండీ! ఆ శేషగిరి సజీవుడుగా వున్నాడా?" అని అడిగాడు.

"అతను యిప్పు డెక్కడా ఎక్కువగా కనిపించడము లేదండీ!" అన్నాను.

"ఎన్నాళ్ళని ఓపిక పట్టగలనండీ? ఈ రోజేదో తేల్చుకోకపోతే కాదు! దౌర్భాగ్యుడు!" అన్నాడు కాస్త వెగటుగా. అటువంటి సజ్జనుడి నోట్లో అటు

వంటిమాట వెలువడిందంటే—అతని మనస్సు ఎంత రోసిపోయి వుంటుందో ?...

"నా సలహా వింటారూ ?" అన్నాను.

"మీ సలహా మంచిదైతే తు. చ. తప్పకుండా పాటిస్తాను. చెప్పండి !" అన్నాడు.

"రేపుసాయంకాలం అతను జీతం తీసుకుంటాడు. అంతవరకు అతనికి కనిపించకండి! అతను జీతం తీసుకుని బయటికి రాగానే—పొంచివుండి పట్టుకోండి. అలా కాదంటే—శేషగిరి మీ చేయిదాటి పోగలడు ! మీ డబ్బు మీకు దక్కకపోవచ్చు !"

"తప్పకుండా మీరు చెప్పినట్లే చేస్తాను."

అతను చెప్పినట్లే—యింతవరకు శేషగిరికంట బడలేదు.

పురాణాల్లో పేర్కొనబడిన సముద్రాలు ఏడు. ప్రపంచ చరిత్రలో వ్యవహరింపబడుతూన్నవి ఐదు! సముద్రాలసంఖ్య ఎన్ని అయినా శేషగిరి పాలిట ఒక సముద్రం ఎక్కువగానే గోచరిస్తుంది. అదే ఋణసాగరం ! అందులో అతనిది అనంతప్రయాణం!

చీకట్లు చిక్కగా అలుముకొన్నాయి. వీధి దీపాలన్నీ ఒక్కసారిగా వెలుగుల్ని కురిపించాయి.

ప్రక్కన ఆఫీసుముందర గందరగోళంగా వుంది. జీతాలు పుచ్చుకున్నవారి సంతోషగాత్రాలు సంతత ధారగా వినవస్తున్నాయి.

శేషగిరికోసం వచ్చిన యిద్దరు ముగ్గురు అప్పుల వాళ్ళు నిరాశతో వెనుదిరిగి పోయారు.

ఇందాకటివరకూ నాగరాజుశెట్టి ఆఫీసుదగ్గఱ కనిపించకపోయేసరికి అతనికి యిక ఆశాభంగం తప్పదనుకున్నాను.

ఏమీ పాలుపోనప్పుడు బజారువెంట అలా చుట్టి రావడం నాకు వాడుక.

ఇంట్లోనుంచి బయటికి వచ్చాను.

హైస్కూలువరకు వచ్చేసరికి అక్కడ వీధి దీపానికి కాస్తదూరంలో, రోడ్డుప్రక్కగా నాగరాజు శెట్టిని బ్రతిమాలుకుంటూన్న శేషగిరి కనిపించాడు.

నాగరాజు శెట్టిచేతిలో కరెన్సీ నోట్లున్నాయి.

నాకు సభ్యత జ్ఞాపకంవచ్చి, చూచీ చూడనట్లు వెళ్ళిపోతుంటే - శెట్టి "యిలా రండి!" అని పిలిచాడు.

"చూడండి ! కష్టాలంటే ఏమిటో నాకూ తెలుసు ! కానీ ఎన్నాళ్ళని నేనుమాత్రం సహించగలను ? 'ఇప్పుడు నాకేమీవద్దు. ముప్పైఫ రూపాయలుతీసుకుంటాను. మిగతా నిదానంగా యిద్దురుగానిలెండి' అంటే 'పదిరూపాయలు తీసుకెళ్ళు ! మిగతా పై నెలలో యిచ్చేస్తా' నంటున్నాడు. ఇటువంటి వాగ్దానాలు ఒకటా ? రెండా ? న్యాయం చెప్పండి. మీరేమంటే అలాగే చేస్తాను. ముప్పైఫరూపాయలు మాత్రం యిప్పటికి తీసుకుంటాను. అది అధర్మమే నంటారా - నాకు చిల్లిగవ్వ వద్దు. వెళ్ళిపోతాను ?"

నేను ఏం చెప్పాలో తోచక తికమక పడుతున్నంతలోనే - శేషగిరినోరు విప్పేశాడు. "నా విన్నపం కూడా వినండి శ్రేష్ఠిగారూ ! మీకూ భార్యాబిడ్డలున్నారు. కాస్త అర్థం చేసుకొండి నే నిప్పట్లో చాలా యిబ్బందుల్లో వున్నాను. వచ్చిన ఎనభై ఒక్క రూపాయల్లోనూ - మా ఫోర్ మేన్ ఆఫీసులోనే నిలవేసి అయిదురూపాయలూ లాక్కున్నాడు. ఇంకా చాలా అప్పులున్నాయి. ఇవన్నీ కొంచానికి కొంచెమైనా సర్దుబాటు చేయకపోతే నేను తలెత్తుకు తిరుగలేను. నామాట విని పది రూపాయలు తీసుకోండి ! తతిమ్మా రూపాయలణాలు పైసలతో సహా వచ్చేనెల్లో చెల్లించుకుంటాను."

"ఇప్పుడు యివ్వలేనివాడివి వచ్చేనెల ఎక్కడి నుంచి యిస్తావయ్యా ?"

"మీ కెందుకూ ? నేనిస్తానంటున్నానుగా ? ఇవ్వకపోతే అప్పుడు అడగండి !"

"ఏమీ పనిలేదు. మీ ప్రమాణాలు నాకు తెలియనివి గనుకనా ? నేను ముప్పైఫ తీసుకుంటున్నాను. మిగతాది తీసుకోండి."

"నేను చెబుతుంటే అర్థంచేసుకో నంటున్నారు. తీసుకుంటే పదిరూపాయలు తీసుకోండి లేకుంటే మొత్తంగా పట్టుకెళ్లిపొండి. నా అభ్యంతరం ఏమీ లేదు. ఆపైన మీ యిష్టం!"

"నన్ను పూరికే విసిగించకండి. మొత్తంగా ఎత్తుకు పొమ్మన్నా ఎత్తుకుపోగలను, పేదవాడవే పాపం - అన్నదయ ఒకటి అడ్డువస్తోంది. ఇక బిర్ర బిగుసుకుంటే - అదీలేదు. నా మాటవిని, యిదిగో-మిగతా తీసుకోండి."

"వద్దండీ! తీసుకెళ్లిపొండి! పాలముంచిన నీట ముంచినా మీరే యిక!"

నాగరాజు శెట్టి ఓరిమి అంతా పటాపంచలై పోయింది.

"సరేలెండి! నాది మాత్రం పోయిందేముంది? డబ్బు వస్తుంటే వద్దనడానికి నేనేం బుద్ధిహీనుణ్ణి కాను. నాఅరవై రూపాయలూ నేను తీసుకుంటున్నా. ఇంద మిగతావదారు!"

ఎందుకులెండి. అదీ మీరే వుంచుకోండి! ఎంత మొరపెట్టుకుంటున్నా ఆలకించనంటున్నారు. మీరువదండి-యిక! తెల్లవారగానే ఏనుయ్యో గొయ్యో వెతుక్కుంటాను! "-ఇంచుమించు ఏడుపు గొంతుకతో అన్నాడు శేషగిరి. అదొక బుడ్డ బెదిరింపు!

నాగరాజు శెట్టిముఖంలో కోపమూ, అసహ్యమూ-రెండు పెనవేసుకుపోయాయి. కళ్ళు ఎర్రనైపోయాయి. "ఛీ నీబ్రతుకులో బుగ్గిపడ! ఈ సిగ్గులేని బ్రతుకు ఎన్నాళ్ళు బ్రతుకుతావు? తీసుకో! బ్రాహ్మడికి దాన మిచ్చేశాననుకుంటాను!" అంటూ నోట్లన్నీ శేషగిరి ముఖంమీద విసరికొట్టి, తిరిగి చూడకుండా చరచరా స్టేషనువైపె వెళ్ళిపోయాడు.

అతని సౌహార్దతకు ఆశ్చర్యచకితుడనై పోయాను!

శేషగిరి క్రిందపడిన నోట్లను గబగబ ఏరుకుని "నాకుతెలుసునయ్యా-యిటువంటి మనుషులదగ్గర అప్పుచేయడం ప్రమాదకరమని! వున్నట్టుండి నెత్తి నెక్కి కూర్చుంటారు" అన్నాడు.

అవును! మీరు సర్వజ్ఞులు! ఏది ఏమైనా-ఈరోజు మీఅదృష్టం బాగుంది. తెల్లవారిలేచి, నక్క మొహం చూసివుంటారు." అన్నాను.

శేషగిరి మళ్ళీ అన్నాడు—"ఇతగాడి డబ్బు ఎవడిక్కావాలీ? వచ్చేనెల పంపించేసెయ్యనూ? నేనూ మనిషినే! నాకు అంతమాత్రం జ్ఞానం లేదేమిటి?"...అతను యిలా అంటూ వుండగానే—వూళ్ళోకి ప్రవేశిస్తూన్న బస్సు హారను మ్రోగడం, బస్సు లైట్లకాంతి శేషగిరిమీద పడటం జరిగినై.

శేషగిరి సింహనాదం విన్న గజరాజులా తత్తర పాటుతో ప్రక్కనే వున్న చెత్తడబ్బా చాటుకు తప్పుకున్నాడు!

ఈ విచిత్ర దృశ్యాన్ని చూసి ఆశ్చర్యంతో స్తంభించిపోయాను!

అతని హాస్యాస్పద ప్రవర్తనకు కారణం ఛటుక్కున స్ఫురించింది!

శేషగిరి దేశాలు తిరిగినవాడు! ఎక్కడెక్కడ ఎందరెందరు నాగరాజుశెట్లు వున్నారో లెక్కించుకుంటే అదొక అంతులేని కూడిక లెక్క అవుతుంది.

త్రాటినిచూసి పాము అని భ్రమించినట్లు, తన నీడనుచూసి దయ్యమనుకొన్నట్లు బస్సులో అప్పుల వాళ్ళెవరైనా ప్రయాణిస్తూ వుంటారేమో నని భయపడి వుంటాడు శేషగిరి! పాండవులు విరాట రాజు ఆశ్రయంలో వున్నారన్న విషయం దుర్యోధనాదులకు తెలియకూడదు కదా మరి!...

అందుకే శేషగిరి బస్సు లైట్ల కాంతిలోనుంచి చీకట్లోకి తప్పుకున్నాడు.

అతనిపైన నాకు ద్వేషంగాని, అసహ్యం గాని కలుగలేదు. నిస్సహాయమైనటువంటి, నిరర్థకమైనటువంటి అతని జీవితంపట్ల జాలి కలిగింది. వెనువెంటనే—ఈ శేషగిరి ఏనాటికైనా ఋణవిముక్తుడు కాగలడా అన్న సందేహం కూడా కలిగింది. ఆ సందేహాన్ని స్వగతంలోనే నివృత్తి చేసుకొన్న పిదప—నా మనసులోనుండి సానుభూతి ఉద్భవించి, అది నోటిలో వాక్యరూపాన్ని పొంది, పెదవులను నెట్టుకుంటూ బయటపడింది. "అయ్యో శేషగిరి!"

## మహాత్ముఁడు | నాగళ్ల గురుప్రసాదరావు

అలప్రాబల్యాల పంటయో! యుపనిషద్వ్యాఖ్యానమో! బ్రాహ్మణ
మ్ముల తాత్పర్యమొ! ధర్మశాస్త్రముల రూపుందాల్పొ! నీబాట; పా
పలకుఁ సైతము తేటతెల్లములుగా బ్రహ్మార్థముల్ విప్లవ
జ్వలన జ్వాలలలో నొనర్చితివటే! సత్యప్రయోగమ్ములఁ.

శమ సౌభాగ్యముతో శివంబగు నహింసాశక్తితో సూనృతా
స్త్రముతో భాస్కరుడస్తమింపని మహాసామ్రాజ్య సౌధమ్ము కు
ద్యములఁ గూర్చిన పోటుకాడవయినావా? నీ యసాధారణా
త్మ మహౌన్నత్యము సూచి లోకములు రోమాంచమ్ములందోగెనా?

పైపై పూతల చెల్మికిక్క యపలాపప్రౌఢి కాణాచి భే
దోపాయమ్ముల కొల్వుకూటము దురంతోద్రేకముల్ ప్రోవు నిం
దా పాపమ్ముల యాదితీర్థము మృషాతర్కంబు కేళీగృహం
బై పెంపొందును రాజనీతి, పద మేలా మోపి తీ వచ్చటఁ.

లోకమ్మంతయు మాయగాదలచి యాలుంబిడ్డలంబాసి యే
దో కానఁబడి యింద్రియార్థముల పొందుఁవీడి యోగాదులఁ
జేకొన్నట్టి నరుండుగాని పరముఁ జేరండటంచుఁ ఋషుల్
వాకొన్నారుగదా యతీంద్ర! మఱి యావాక్యమ్ములూహింపవో?

వెతలంగూరి యశాంతికిఁ నిలయమై భీత్యావహంబైన భా
రతదేశంబు పిసాశి యేలుబడి రారాపిళ్ళకుఁ దవ్వుగా
జతనంబుల్ పొనరించి ముక్తి పదవీ సంపత్తులఁ గొల్లలా
డితి; వీయోగ రహస్య మార్గములు తండ్రీ! యెట్లు కన్గొంటివో?

పరతత్త్వంబు వరించు తాపసుడు జీవత్ప్రేతమై భూమికిఁ
బరువై మన్గడ ద్రోయు; లోకవిషయ వ్యాసక్తు డాస్తిక్యముఁ
విరసించుఁ బహుభోగ లోలుపుడగుఁ నీవైహికాముష్మికాం
తరముల్ దూలిచి దాస్యమోచనములో దైవంబు దర్శించితే !

అనిదంపూర్వములీ ప్రయోగములు నీయందుద్భవించెఁ సనా
తన తేజమ్ము నవీన రూపమున సప్తర్షల్ ప్రకాశించుచో
టనె నీవుఁ నెలకొంటి నీవెలుగువెంటఁబోయి నిత్యమ్ము శాం
త్యనుభోగమ్మున జొక్కిసోలు నిలపై నాబాలగోపాలముఁ.

నానార్థమ్ములవాడు గాడు పరనిందాగర్భిత వ్యాఖ్యలఁ
గానఁరాడు విగూఢ సూత్రముల దాగఁలేదు సౌఖ్యావహ
స్థానంబొల్లడు సర్వవేద్యుడగుచుఁ సత్యస్వరూపంబుతో
నీనారాయణుడొప్పు నన్యులను మౌనీ ! నీవు మోహింపవో ?

కైవల్యార్థము విప్పి చెప్పితి వహంకారంబు నాకట్టి ధ
ర్మావిష్కారము సేయగంటి స్వపర వ్యత్యాసముల్ ద్రోసి స
ద్భావంబుఁగొని యాడిపాడితివహో ! వర్ణస్థితుల్ రోసి నీ
యీ వైదగ్ధ్యము భారతావనినిమాయించెఁ బురాపాపముల్.

తాతల్ తండ్రులు గీత మంచిదగుటఁ ధర్మంబు కన్గప్పి చే
సేతఁ దామరు లూడిగంబు సలుపఁ జీవించిరిన్నాళ్ళు న
ట్లే తానుఁ మన నారటంపడె నరుం డీగడ్డపై నీకు నా
రీతుల్ గిట్టవాయేమొ లోవెలుగు దారింద్రిప్పితా సోమరిఁ.

తలక్రిందై తపమాచరించి భగవత్తత్త్వమ్ము గన్గొన్న వా
రలలో నెవ్వడు వాఙ్మనః క్రియల వేర్పాటుఁ విరోధించె ద్రా
బలకుఁ బుద్ధులుమప్పె శాంతి సుధలుఁ బండించె నౌదార్యముఁ
వలచెఁ నీవలె నీకు నప్పువడెనప్పా ! విశ్వ విశ్వమ్ములుఁ.

# కొన్ని సామెతలఁ గన్న చిన్నకథలు 'శండిల'

*'నీవు ఒకందుకు పోస్తున్నావు నేను ఒకందుకు త్రాగుతున్నాను'.*

పీనాసి పేదరాశి పెద్దమ్మ నడుపుతున్న వంట పూటింటికి వెయ్యిమాయలగాడొకడు వేళగానివేళ భోజనానికి వెళ్ళాడు. అప్పటికే ఆ పూటకూళ్ళమ్మ గిన్నెలు కడుక్కుంటోంది. "అవ్వా! అవ్వా! ఆకలికి తాళలేకుండా వున్నాను" అని ప్రాధేయపడ్డాడు. "నాయనా! వండిన కూరంతా అయిపోయింది. రెండునిమిషాలాగితే చేసిపెడతాను. సమయాన్ని బట్టి ధర కొంచెం హెచ్చౌతుంది. ఖచ్చితంగా రూపాయ పుచ్చుకుంటా. ఏం ?" అని ప్రశ్నించింది. "సరే" అన్నాడు అతడు ఆమె గడుసుదనానికి ఆశ్చర్యపడుతూ. పొయ్యిరాజేసి ఎసరు పెడుతున్న పెద్దమ్మకు 'వీడు బకాసురుడులా గున్నాడే- రూపాయ యిచ్చి రెండురూపాయల పై చిలుకు పట్టేసేలాగున్నాడు. ఎలాగైనా లాభం చేసుకోవాలి' అని గుణించుకొని ఒక చక్కనిఊహ తట్టగా చావడిలోకొచ్చి అన్నదీ "బాబూ! ఆలస్యమౌతుందేమో కొంచెం వార్పు దాహానికి తీసుకోగూడదూ ?" మనవాడి కళ్ళు సంతోషంతో మెదిలాయి. "అయ్యో! ఇంతకన్నా ఉందా అత్తా?" అంటూ గంజి బుచ్చుకోడానికే తయారుపడ్డాడు. ఎంత యెక్కువ గంజి తాగితే అంత కూడు తక్కువ తినకపోతాడా అనే ధీమాతో ప్రొద్దుటినుండి వార్చిన రెండు నిండుకుండల గంజి పోసేసింది. అతగాడు సీదాగా త్రాగేశాడు. వెంటనే మూతి తుడుచుకొని మీసాలు సరిచేసుకొని "అత్తా మరి నేవెళ్ళొస్తా ఇంక ఈ పూటకు శ్రమలేదు నీ కడుపు చల్లగా" అని ఆమెవద్ద సెలవు తీసుకొన్నాడు. అనేక లౌక్య వ్యవహారాలలో, రాజకీయ వ్యూహాలలో వివిధ వ్యక్తులు వింత వింత రీతులలో ప్రవర్తించే సందర్భాలను తలచుకుంటే ఈ లోకోక్తి గుర్తుకు వస్తూంటుంది.

*'కాస్తంత తీసుకోవాలి లేకపోతే కడుపుబ్బుతుందిట - అంటే మరి అంతా కాజేసేవాడిమాటో ?'* అన్నాడు.

కంసాలులను గురించి కోకొల్లలుగా బయల్వెడలే సామెతలలో ఇది ఒకటి. తరచు 'తల్లి దగ్గరైనా సరే కాస్తంత కక్కుర్తి పడాలట- లేకుంటే కడుపుబ్బుతుందిట' అని సామెత. 'చూసిన వీసము తరుగును, కాసిచ్చిన సగము తరుగు' అని గూడా అంటూండడం వింటాం. ఒకరాజు విశ్వకర్మలకు పుట్టుకతో అబ్బిన ఈ కళలోని ప్రావీణ్యం పరీక్షింపదలచి కబురంపి వేర్వేర వరుసన ప్రశ్నించాడు. 'లేదంటే తులం ఆదాయం చేయగల' నని ఒకడూ, 'ఆ పాతికభాగం లాగెయ్యగల' నని మరొకరూ, 'చెరిసగం మినహాయించగల' నని మూడవ వారూ అనగా ఆ కళలో తలనెరసిన ప్రావీణ్యుడు ముందుకు వచ్చి "రాజా, తమ సెలవైతే అంతా కాజెయ్యగలను" అన్నాడు. రాజు నిజంగా ఆశ్చర్యపడి "ఏదీ చూపు నీ ప్రజ్ఞ" అని ఆజ్ఞ యిచ్చాడు. నూరుతులాల మేలిమి నందివిగ్రహం చేయాలని పురమాయించబడింది. ప్రతిరోజూ విశ్వకర్మను నఖశిఖపర్యంతం శల్యపరీక్ష చేసి కర్మశాలకు పంపుతూ పని పూర్తిచేసుకొని బయటకు వచ్చేటపుడు గూడా అదే నిఘాతో తనిఖీ చేయించేవారు. నెలరోజులకు నందివిగ్రహం పూర్తియయ్యింది. ముద్దులమూటగట్టే ఆ మూర్తిని

ప్రతిష్ఠించేనాడు బ్రహ్మాండమైన ఊరేగింపు బయలు దేరదీయించాడు రాజుతో విశ్వకర్మ. ఊరేగింపు అయ్యాక పురసమీపంలో వుండే నదిలో నందిని స్నానం చేయించాలని విశ్వకర్మ భటులతోను పరివారంతోను రాజును తీసుకువెళ్లి స్వహస్తాలతో నందిని మొలబంటలోతు నీటిలోముంచి పైకెత్తాడు. అందరు "హర-హర-మహాదేవ" అని జయజయ కారాలు చేశారు. దేవాలయంలో ప్రతిష్ఠ వేదోక్తంగా జరిగింది. మరి మూడునాళ్ళకు పూజారి ఆలయం తలుపులు తెరచి తనకట్టెదుట దృశ్యాన్ని చూచి నిశ్చేష్టుడయ్యాడు. తళతళ మెరుస్తూవుండవలసిన స్వర్ణనందికేశ్వర విగ్రహం నల్లగా మాడిపోయింది. వణకిపోతూ బిక్కమొగం వేసి అతడు ప్రభువుముందు మోకరిల్లి యావత్తు సంగతి మనవి చేసుకున్నాడు. రాజు సేవకులపైనా, పూజారులపైన మండిపడబోగా విశ్వకర్మ లేచి "రాజా—వారినేమీఅనకండి. నామాట అక్షరాలా నెరవేర్చుకున్నాను" అన్న ఆ మాటలు విని "అదెలా జరిగింది?" అని ప్రశ్నించాడు. "రాజా, క్షమిస్తానంటే మనవిచేస్తా" నని రోజూ తమ యింటివద్ద రాజాస్థానంలో ఎట్టి బంగారునందిని చేస్తూవచ్చాడో అట్టిదే ఇత్తడిబొమ్మను పూర్తిచేసిన పద్ధతి, తుదకు సంబరంనాటి వేకువనే నదీగర్భంలో దాన్ని నిక్షిప్తంచేయడం, బంగారపు మూర్తిని ముంచి దీన్ని తేల్చినవైనమూ చక్కగా వర్ణించాడు. "కాస్తంత తీసుకోవాలి - లేకుంటే కడుపుబ్బుతుందిట. అంటే మరి అంతాకాజేసేవాడిమాటో?" అంటారిందుకే అని విశ్వకర్మయుక్తికి మెచ్చుకొని యుక్త బహూకృతి చేశాడు రాజు.

*'అత్తా వంకాయ చిటుక్కు మీవాళ్ళంతా బుడుంగు'.*

ఈ వాక్యాలు తల్లి కొడుకు కోడలు మాత్రమే వున్న కుటుంబానికి చెందినవి. కోడలికి ఎప్పుడు అత్తగారి మీదే గుర్రుగా వుండేది. పాపం! అత్త ముసదిలి కావడంవల్ల ఆమె బాధకు తట్టుకోలేక పొయ్యేది. అలాగున్నప్పటికి అత్తగారిని శాశ్వతంగా అవతలి కంపెయ్యాలని కోడలు భర్త యింటలేని ఒకనాడు మెట్టవంకాయ నొకదాన్ని తెచ్చి అత్తగారి గొంతులో దిగిదిగకుండా వుండేటట్లు బిగ వేసింది. ఆకాయ క్రిందికిపోక మీదుకురాక మరణ వేదన అనుభవిస్తూ అత్తగారు కొడుకు ఇంటికి రావడం లగాయతు తనకు నోటమాట రావడానికి వీలులేనందువల్ల చేసంజ్ఞతో గొంతు చూపుతూ, మధ్య మధ్య కోడలిదెస వ్రేలుచూపేది "ఇదేవిటే" అని గద్దించాడు కొడుకు. "అదేనా. మీ అమ్మగారి మనస్సు! ఈ వయసులో ఆవిడకు మెడలోకి పట్టెడగావాలిట. నా పట్టెడవంటిది చేయించాలని కోరుతూంది" అని జడుపుగిడుపు లేకుండా జవాబు నిచ్చింది కోడలు. తల్లిపై కోపించి కొడుకు కర్ర పుచ్చుకొని మెడపై వేసి గొంతువద్ద పొడిచాడు. ఆ దెబ్బకు వంకాయకాస్తా ఊడి ఇవతలపడింది. ఆ ముసలావిడ ప్రాణం గుటుక్కుమన్నది. మర్నాటినుండి కోడలు స్వేచ్ఛగా వుంటూ ఆ మూలా ఈ మూలా "అత్తా వంకాయ చిటుక్కు" మని పాడుతూ వుండేది. కొడుకు 'సరే-దీనికి తగిన శాస్తిచేయకపోతానా!' అని లోపలనే ఆలోచించుకొని భార్య కనుసన్నలలో మసలేవానికివలె నటించడం ప్రారంభించేడు. కొంత కాలానికి తమ యింటిలో శుభకార్యం మిషపై తనవారందరినీ దగ్గరవుండి స్వయంగా తీసుకురమ్మని పెనిమిటిని పుట్టింటికంపింది. 'సరే. ఉన్నంత మటుకు ఆలి వంక బంధు జనాన్నందరిని లేవగొట్టి దారిలో నావదాటించేవాడికి కొంత లంచమిచ్చి కాదలచిన దాన్ని కానియ్యమన్నాడు భర్త. సరిగా నావను నట్టేటకు రానిచ్చి ముంచేశాడు వాడు. పిల్లా మేకాతో బంధువులందరు నీటిలో మునిగి చనిపోయారు. ఏమీ యెరగనట్టు ఇంటికి తిరిగివచ్చి "ఒక్కరు రానన్నారు. తీరు బడిలేదట" అని సమాధానం చెప్పాడు పెళ్ళానికి. మళ్ళీ ఎప్పటి లాగునే పాట పాడుకునే పెళ్ళానికి వంతపాడడం మొదలు పెట్టాడు "అత్తా వంకాయ చిటుక్కు"

మని ఆమె. "మీవాళ్ళంతా బుడుంగు" మంటూ ఆయన.

*'దొందుకు దొందే కొందప్పా'*

నత్తివాళ్ళ గొడవను వెక్కిరించే సామెత యిది. 'రెండుకురెండే కొండప్పా' అని నత్తివాడు ఉచ్చరించాలంటే దానిరూపం ఇలాగే వుంటుంది. ఒక పెళ్ళి జరిగింది. వధూవరులిద్దరకు నత్తి. పెళ్లి కుదిర్చిన పెద్దలు బహు చాకచక్యంతో వ్యవహరించి ఈ రహస్యం మూడుముళ్ళూ పడేదాకా పొక్కనివ్వకుండా జాగ్రత్తపడ్డారు. ఏకరాత్రిపెళ్లి; నాడే పునస్సంధానంగూడా ఏర్పాటు చేశారు. పేరంటాళ్లు లాంఛనాదులన్నీ పూర్తిచేయించి మొగుడూ పెళ్ళాల నిద్దర్నీ గదిలో విడిచి బయటగొళ్లెం బిగించారు. చాలాసేపు ఇద్దరూ మౌనంగానే వున్నారు; కడకు తెగించి వరుడే దాన్ని భేదించక తప్పిందిగాదు. - మెల్లిగా పెళ్లికూతురును గిలిగింత పెట్టాలని "ఎవలత్తలా? (ఎవరక్కడా? అన్న ప్రశ్న)" అన్నాడు. ఆ పిల్ల గొంతు సవరించుకొని ముసిగా నవ్వుకుంటూ సిగ్గుపడి అనలేక అనలేక "పెల్లితూతులూ (పెళ్లికూతురు అని జవాబు)" అన్నది. వరుడు అంతవరకు తానే సాధించేశానని విర్రవీగినవాడల్లా గుటకవేశాడు. వీరిరువురి ప్రప్రథమ సంభాషణలను తలుపు వెలిసెలోంచి చూస్తున్న ఒక ముదిపేరక్క మహా పరిశోధనమీద తానేదో ఘనకార్యం సాధించినట్లు ఆ ప్రక్క వసారాలో పడుకొనివున్న తోడి అమ్మలక్కల్ని లేపి నవ్వుతూ "ఒలే - ఒలే - దొందుకు దొందే కొందప్పా" (రెండుకురెండేనే - అనగా వాడికి తగ్గది ఇదీ; దీనికి తగ్గవాడు వాడూ అని అర్థం) అంది. ఔనుమరి! ఆ పేరమ్మకు కూడా నత్తేమరి. ఇంకెలాగ ఆ జంటను వెక్కిరిస్తుంది? (లోగడ జయంతి 'తొలిసంచికల్లో ఈ సామెతనుగురించియే ఇతరత్రా ప్రచారంలోవున్న కథ వ్రాశాను. దాన్ని మించి ఇదే తగినదిగా వుంటుందని తోస్తే పాఠకులు దీన్నే తీసుకుంటారని ఆశ.)

*'ఇసుకతక్కెడగాడు పేడతక్కెడగాడు'*

ఒకడినిమించి మరొకడు యుక్తిపరుడు ఎత్తుపై ఎత్తులగాడుఉంటుంటారు; సర్వవిధాలా తుదకు ఎట్టి నీచత్వానికైనా దిగజారి తమ ప్రయోజనమే ప్రధానంగా యెంచుకొనే తుచ్ఛస్వార్థపరుల్ని ఈసామ్యం ఎత్తిపొడుస్తుంది. ఇసుకతక్కెడగా డొకచోట దొంగిలించి తెచ్చిన వెండిగిన్నె తాడిచెట్టు మొవ్వులో ఎవ్వరికి తెలియకుండా దాచేశాడు. వెండిగిన్నె పోయినసంగతి పేడతక్కెడగాడు కనిపెట్టి ఇది తప్పక వీడిపనే అని ఇసుకతక్కెడగాణ్ణి వనవేసి కాపుగా తిరగడం మొదలుపెట్టాడు. ఒకనాటిరాత్రి ఎవ్వరూ చూడ్డంలేదని చీకటిలో చడి చేయకుండా తాడి పైకెగబ్రాకి గిన్నె తీసుకొని వడిలో పదిలంగా వుంచుకొని దిగుతున్నాడు. వీణ్ణి మించిన ఉపాయంతో పేడతక్కెడగాడు పైవాడు దిగేలోపల చెట్టు నెక్కడం వాడికి తెలియకుండా వాడి వడిలో గిన్నెను కాజేసి సడి చెయ్యకుండా ఇంటికి చేరుకున్నాడు. ఇసుకతక్కెడగాడు తన వడిలో గిన్నె ఎలా మాయమయ్యిందా అని విభ్రాంతిపడి దానికై వెదకడం మొదలుపెట్టాడు. పేడతక్కెడగాడు గిన్నెను ఎవ్వరికి అందకుండా చేయాలని తాను పడుకొన్నచోటనే తనకు తిన్నగా ఉట్టిమీద వ్రేలాడగట్టి దాని అంచులకంటా నీళ్లుపోసి నింపాడు. ఎవరు గిన్నెను కాస్తంత కదిపినా నీళ్ళు మీదబడి తనకు మెలకువ వచ్చితీరుతుందని వాడి ధీమా. ఇసుకతక్కెడగాడు వీడికి కొంచెం కునుకు పట్టనిచ్చి బొప్పాయికర్ర గొట్టం ద్వారా గిన్నెలోని నీటినంతను సీదాగా త్రాగేసి గిన్నె పట్టుకుపోయి మొలబంటిలోతున నీటిలో దాచేసి ఇంకెవ్వడూ ఏలాగు కనుక్కోలేడనే ధీమాతో సుఖనిద్రలో వున్నాడు. మరోక్షణానికి పేడతక్కెడగాడు లేచి గిన్నె పోవడం గమనించి వెదకడం బట్టాడు. ఇసుకతక్కెడగాడు హాయిగా నిద్రపోవడం గమనించి వెనుకపాటునే వెళ్ళి వాడి శరీరాన్ని శిఖనుంచి క్రిందికి రుచిచూడ్డం ప్రారంభించాడు. మొలవరకు ఉప్పగాను అక్కడనుంచి చప్పగాను తగిలింది. ఇంకేముందీ? తేలిపోయింది. మొలలోతు నీళ్ళలో మునిగివచ్చాడు వీడని. వెంటనే నదికిపోయి వాడు సుపరిచితంగా దిగేరేవు ఎరిగివున్నవాడు గనుక నీళ్ళలో దిగి గిన్నె కాస్తా పట్టుకుపోయాడు. ఇలాగా కల్పనాజగత్తును విస్తరించుకుంటూ పోతే పల్లెపట్టుల ప్రచారంలో వున్న ఎత్తుపైయెత్తు కుయ్యెత్తులన్నీ వాకొనుకోవచ్చు. ఏది ఎలాగున్నా తెలుగునాటమాత్రం ఈ రెండు పేర్లు పాతుకుపోయాయి.

# సోమసుందర్ అంగారతల్పం

ఒక్కక్షణం తర్వాత ఏం జరుగుతుందో తెలియని మానవులం, వందలాది వత్సరాల భవిష్యత్తు గురించి ఏవో వెర్రి మొర్రి ఊహలు సారించుకుంటాం. ఏదో ఒక చమత్కారమైన భ్రమలోనే మన మెప్పుడూ బ్రతుకుతూంటాం. ఇదే మానవ జీవిత రహస్యమే మో! మన జీవితంలో జరిగే కొన్ని అపురూప సంఘటనల అనుభూతులకు మల్లేనే, యాదృచ్ఛికంగా జరిగే కొన్ని సన్నివేశాలు కూడా జీవితాంతం మరచిపోలేం.

అదేం చిత్రమో, ఆవేళ ఉదయంనుంచీ నా మనస్సు అగోచరమైన ఏ విషయాన్ని గురించో ఆదుర్దా పడుతూనే వుంది. నేను మరచిపోలేదు; నవంబరునెల చివరిరోజులవి. నేను చేతులారా పెంచిన ఢాలియాలు, పెటోనియాలు, గైలార్డియాలు, డయాన్తస్‌లూ వంటి విదేశీ పూల మొక్కలు వొంటినిండా పూలు విరియబూసి ఠీవిగా నుంచున్నాయి. హాయిగా గాలితో ఎక సక్కే లాడుతున్నాయి. అవునా? ఆపూల మెత్తనిరంగులు నామనసుకు మత్తెక్కించవలసిందేనా? కాని అలా జరగలేదు. కార్తిక మాసపు సాయంత్రం చలిగాలి జిమ్ముకుంటూ వీస్తోంది. దుర్జనుల కుటిలచిత్తంలాగ చలిగాలి బాధాకరంగా ప్రసరిస్తోంది. ఎందువల్లనో నాకేమీ వూసుపోవడంలేదు. మాయింటిముందరి సందులో అటూ ఇటూ పచార్లు చేస్తున్నాను. శూన్యంగా నలుప్రక్కలకూ పరిశీలిస్తున్నాను.

హఠాత్తుగా పెంటపోగులో పడివున్న వస్తువొకటి నాకంటపడింది. ఆగాను, చూశాను, పరీక్షించాను. చక్కగా కాలికోబైండు చేసిన పుస్తకమది. బహుశా పవిత్రమైన బైబిలు గ్రంథం కావచ్చు. లేదా చిన్ననిఘంటువైనా కావచ్చు. ఏదైనా ఉపయోగించే వస్తువే కనక తీయడం మంచిదనుకున్నాను. కాని, ఛీ ఎలా తీయడం? నా మర్యాదా, నా హోదా, తాతలనాటినుంచీ పేరుకొని నావరకూ సంక్రమించిన స్థితిగతుల దర్పమూ ఇవన్నీ పెంటలపాలు కావా? ఎలా తీయడం? ... కాని, తీయకపోతే వీలులేదని నాలోని జిజ్ఞాస ఒత్తిడి చేస్తోంది...మనం చేస్తున్న పని ఎంత నీచమైనదైనా, మనం నాగరికులం కనక ఎవరూ చూడకపోతే ఇబ్బందిలేదు. కనకనే చుట్టూ పరికించి చూసుకున్నాను. గుండెదిటవు చేసుకున్నాను. గభీలున ఆ పుస్తకాన్ని తీశాను.

నాకింతవరకూ కనిపించినది పుస్తకం వెనుక భాగం తిప్పిచూశాను. చిత్రం!... నేను భావించినట్లుగా అది పవిత్రమైన బైబిలు గ్రంథం కాదు. పందొమ్మిదివందల ముప్పై తొమ్మిదో సంవత్సరపు డైరీమాత్రమే...

ఎవరిదో పాపం పెంటలపాలైంది ... మహా మహా జీవితాలే పెంటలపాలవడం తప్పనపుడు చెత్త డైరీ పుస్తకానికి వచ్చిందా? అది సుతరామూ నాకు సంబంధించని మరో అజ్ఞాత వ్యక్తి డైరీ కూడాను. దానిని నేను చదవడం ఏమంత మర్యాదా? కాని, ఇతరుల విషయాలు సాధ్యమైనంత ఎక్కువగా తెలిసికోవాలనిపించే నాలోని మానవదౌర్బల్యం తీసి చదవమని ప్రోద్బలం చేస్తోంది పైగా. పదిహేడేళ్ళక్రితం సంగతులాయె! చూస్తే ఎవడికి మాత్రం వచ్చే ప్రమాదమేమిటి? మొత్తానికి తర్కం జోరుగానే

సాగింది. చూడ్డానికే నిశ్చయించుకున్నాను. గబగబా యింట్లో ప్రవేశించాను. వస్తూనే దూకుడుగా గదిలో టేబిలుమీద వున్న లాంతరు హెచ్చించాను. తలవనితలంపుగా భయంకరంగా దీపం ఒక్క దగ్గుదగ్గి కుదుటపడింది.

డెయిరీ అట్ట తెరిచాను. 'కె. యస్. పాండురంగారావు' అన్న పేరు స్పష్టంగా రాయబడివుంది. ఆ పేరు క్రిందనే సదరు పాండురంగారావుకు సంబంధించిన కొన్ని వివరాలు కూడ పాతసమాధిరాళ్ళమీది విలాసాల్లాగఅస్పష్టంగాకనిపిస్తున్నాయి. కాని ఎన్నివిషయా లుంటేమాత్ర మేంలాభం? ఎరగని వివరాలు ఎరగనట్లే గాలిలోకి తేలిపోతాయి. అవగాహన కేమీ సహాయపడవు. కనకనే నన్నొక్కటే వేధించనారంభించింది. 'ఎవరీ పాండురంగారావు?'.. మా సందులో కాదుకదా. మా యింటికి ఒకటిరెండు ఫర్లాంగుల కైవారంలో ఎక్కడా నా ముప్ఫయ్యేళ్ళ జీవితంలోనూ తారసపడనేలేదు. పాండురంగారావును గురించి నా మనస్సు పరిపరివిధాల ఆలోచిస్తోంది. నేనెప్పుడూ చూడని, కనీసం పేరైనా ఎప్పుడూవినని కె.యస్. పాండురంగారావు నా కన్నులముందు ప్రత్యక్షమవుతున్నాడు.

అతను సన్నగా పొడుగ్గా వుంటాడు. నాజూకుగా వుంటాడు. 'పుంసాం మోహన రూపాయ' అని ఆయనను గురించి చెప్పలేం గాని, చూసీచూడగానే మృదువుగా ఆకర్షించే సత్తా కలవాడే! చామనచాయగా వుంటాడు. లోతుగా విశాలంగా వుండే కన్నులూ, ఒత్తుగా మెరిసే కనుబొమలూ అతని ప్రత్యేకత. సన్నని కత్తిరింపు మీసం అతని రూపానికి అలంకారం.

ఈ విధమైన ఆకారంతో నా మనసుకు దర్శనమిచ్చి, పాండురంగారావు పరిచయమయ్యాడు. అతని జీవితంలో 1939 వ సంవత్సరం గురించి తెలుసుకోకుండా ఉండడమెలాగ? కనుకనే పేజీల తిరగవేస్తున్నాను. నెలగడిచింది. రెండు...మూడు ...నాలుగు నెలలు కూడా గడిచాయి. పాండురంగని జీవితం గురించిన ఏ విషయమూ కనుపించలేదు. దురదృష్టవశాత్తూ అతని తదనంతరమో లేక అతనికే తెలియకుండానో సంక్రమింపచేసుకున్న ఎవరో కుర్రాళ్ల కొంకిరిగీతలు మాత్రం కనిపించాయి. ఏవో చిల్లరమల్లర విషయాల్ని తెలియచేస్తున్నాయి. 'గిసాల వీర్రాజు దొంగవెధవ' అనీ, 'ఆచారి బడాచోర్' అనీ, 'సైకిల్‌వాలీ ఆనందం' అనీ, 'మొక్కుబడికి వెళ్ళిన భర్తలేని గర్భం' అనీ, 'లాటరీ పెళ్ళాం' అనీ— ఇలాగ ఏవేవో అస్పష్టమైన పిచ్చిరాతలు కాళీపేజీలన్నీ ఆక్రమించాయి. శూన్యంగా, నిష్క్రియగా మే నెలలో పన్నెండవ రోజు వరకూ పాండురంగారావు 39 వ సంవత్సరపు జీవితం గడచిపోయింది.

పదమూడో తేదీనుంచి అతని జీవితఘట్టాలు ఇంగ్లీషులో ప్రారంభమయ్యాయి. అక్కడక్కడ అన్వయమే కుదరనంత ఆత్మ సాంకేతికంగా వుందతని యింగ్లీషు.

"... మే 13; శనివారం వైశాఖబహుళ ద్వాదశి. ఈ మెడికల్ డెయిరీని డాక్టర్ బి.సి.కె. గారు బహూకరించారు. ఆయన నాకు చిరపరిచితులే; వృద్ధులు.

పాండురంగారావుకు మే 13 వ తేదీని డెయిరీని బహూకరించిన డాక్టర్‌గారి పేరు స్పష్టంగా తెలియడంలేదు...తరువాత

'...మే 14;— కమల గతరాత్రి అతిభయంకరంగాబాధపడింది. శ్రీ రావును కలుసుకున్నాను. అతని వ్యవహారంలోని చిక్కులన్నీ విశదపరిచాను. పొరపాటంతా అతనిదే. ఆ విషయంలో మాత్రం అతని నడత చాలా చెడ్డగా వుంది. ముఖ్యంగా అతను, తన భార్య విషయంలో తన నడవడి అసహ్యంగా వుందని తనే ఒప్పుకున్నాడు. అతని పరిస్థితి చూస్తే నాకు జాలివేస్తోంది..."

ఈ అస్పష్టమైన కొద్ది పంక్తులలో స్పష్టమైన జీవితచరిత్ర ఏదో తొంగిచూడనారంభించింది. ఈ

రావుగారెవరో మర్యాదగల పెద్ద ఉద్యోగిగా కనిపిస్తున్నాడు. ఒకనాడు తన భార్యను అనుమానించి, కొట్టి తిట్టి అమానుషంగా ప్రవర్తించి వుంటాడు. లేక ఏ చిన్నవిషయం మీదనో కోపాగ్ని రెచ్చి, తాను భర్తనన్న యథార్థాన్ని రుజువు చేసుకోడానికి ఆమెను నిందించి అవమానపరచి వుంటాడు. తన తప్పేమీలేని ఆమె సహించలేక ఎదురుతిరిగింది కాబోలు. ఇద్దరిమధ్యా ఘర్షణ పెరిగింది. మాట్లాడుకోవడం మానేశారు. ఒక యింట్లోనే వున్నా ఎవరిదారి వారిదిగా బ్రతుకుతున్నారు. ఆ సమయంలో మన పాండురంగారావు శ్రీరావుగారింటికి స్నేహ ధర్మంలో వెళ్ళాడు. శ్రీరావు తన విషయాలన్నీ చర్చించివుంటారు. సరే, అతను - దాంపత్య జీవితంలోని తప్పొప్పులను విశదీకరించాడు. పొడసూపిన సమస్యలను పరిష్కరించి వుంటాడు. నాకాసమయంలో, అతనిలో ఆజానుబాహుడైన సంస్కర్త కనిపించాడు.

"...మే, 15 ; కమలకీవేళ ఎక్సురే తీశారు... శ్రీరావు దంపతులను చూచివచ్చాను. సర్దుమణిగింది. చిత్రమేమిటంటే 'టి. సి. హెచ్' లో డాక్టర్ ఎ. ఆర్. శ్యామా అనే బంగాలీ అమ్మాయిని కలుసుకున్నాను. నన్ను చూచిన క్షణంనుంచీ చూపులు నామీద ఆపేసి, నన్నేదో అభినందిస్తున్న భావాన్ని వ్యక్తపరిచిం దామె. అబ్బా! ఆమె నన్ను కళ్ళతో మింగేస్తుందా అన్నంత తీవ్రత ఆమెలో కనిపించింది. నాకు సందేహంలేదు ; ఆమె సౌందర్యవతే!...".

పాండురంగారావు భార్య కమల...పాపం! ఎన్నో రాత్రుల యమయాతన లనుభవించింది! ఆఖరికి డాక్టర్లు పరీక్షించారు. ఎక్సురే తీశారు. అతని జీవితం నిజంగా కష్టప్రకరణంలో ప్రవేశిస్తోంది. అయినా ఏం తప్పుతాయి గనక! స్నేహితుని దాంపత్య జీవితంలో వచ్చిన పొరపొరలను సర్దుబాటు చేయాలి. టి. సి. హెచ్. లో కనిపించిన బంగాలీ అమ్మాయిని గురించి ఆలోచించాలి...

కాని బంగాలీ అమ్మాయి పేరు. 'ఏ.ఆర్. శ్యామా' అని వుండటమేమిటి చెప్మా? 'టి. సి. హెచ్. అంటే టర్నర్సు చౌల్టరీ' కాదుగదా! ఇంకా సందేహమేమిటావిషయంలో...మన కథకు కార్యరంగం విశాఖపట్నం. పాండురంగారావుతో సహా ఆ అందమైన బంగాలీ అమ్మాయి—నా కళ్ళకు కట్టినట్లే వుంది...నాజూకైన శరీరం. సున్నితమైన మంచి గంధపురంగు...కోలవాటుగా బుగ్గలు క్రిందికి జారినట్లుగా వుండే ముఖం, కుడి బుగ్గమీద సెలవులకు అంగుళంపైన చక్కని పుట్టుమచ్చ...చూడముచ్చటగా వున్నదాఅమ్మాయి. మధ్యపాపిడి తీసికొని ఒదులుగా జడవేసుకుంది. పాపటలో ఎర్రని కుంకుమరేఖ నలరుకొంది. ప్రకాశించే నల్లని అంచుగల తెల్లని చీర కట్టుకొంది. అకస్మాత్తుగా అతని మనసులో ప్రవేశించింది. కొంపదీసి జీవితంలో కూడ ప్రవేశించదుకదా! ఏమో చూడాలి.

..."మే...16 : ప్రియమైన వి. గోవిందరావును అభినందిస్తూ టెలిగ్రాం పంపించాను...హాస్పిటల్ లో ఒక భయంకరమైన శవాన్ని చూశాను....కుళ్ళికుళ్ళి చచ్చిన ఆ శవాన్ని చూడలేకపోయాను. కళ్ళుతిరిగి పోయాయి... అనుకున్నట్టుగా శ్రీరావును కలుసుకోవడం పడలేదు."

పాపం అతని హృదయం ఎంత సున్నితం. మామూలు మనిషిలా కనిపించే అతని జీవితంలో ఎన్నికలలు...వికృతంగా భయంకరంగా తయారైన శవాన్ని చూసినా ఉండబట్టలేదు. అందమైన బంగాలీ పడుచు లేడికళ్ళుచూచినా ఆపుకోలేదు. అలాంటిది అతనిభార్య ఆరోగ్యం ఏమవదల్చుకున్నదో మరి!

"... మే. 17 : కమలకి ఔషధం ప్రారంభించారు. క్షయగా డాక్టర్లు నిర్ధారణ చేశారు. నాజీవితం మీద పిడుగు పడింది. ప్రియమైన కమల జీవితాన్ని కాపాడుకొనేందుకు ఏమి త్యాగం చేయగలను ?..."

తరువాత ఐదురోజుల కాగితాలు శూన్యంగా వున్నాయి. కాని అతని దినచర్యమాత్రం శూన్యమై

వుండదు. ఆసుపత్రిలో వున్న భార్యను చూస్తూండ టం; కావలసిన సహాయం చేస్తూవుండటం; రావు గారినీ, బంగాలీ అమ్మాయినీ కలుసుకుంటూ వుండటం,- ఇలాగే బహుళా సాగుతూవుంటుంది. ఏమైనా భార్యసుస్తీ మాత్రం-తనశరీరంలో సరిగ్గా సగం కూలిపోయినంత బాధ కలిగిస్తున్నట్లు స్పష్టం. ... "మే 24; కమలకు గోల్డు మూడు మోతా దులూ, కాల్షియమూ వాడుతున్నారు...."

అతని జీవితం అధ్వాన్నపు అడవిలా, అందో ళనగా సాగుతున్నట్టు స్పష్టం. అతనికి ఆత్మ శాంతి చెడింది. నిముషం తీరిక లేకుండా బజారులన్నీ తిరుగుతున్నాడు. ఊరటలేదు; కనుకనే అతని దిన చర్యలోని పుటలన్నీ కాళీగా గడచి పోతున్నాయి. ప్రతిముఖంలోనూ సానుభూతిని అన్వేషిస్తున్నాడు.

..."మే. 29; సోమవారం. జ్యేష్ఠపౌర్ణమి 'సి' వల్ల ఆశాభగం కలిగింది. రాజుతోసహా అందరూ ఒక్కటిగానే కనిపిస్తున్నారు. సరే ఏంచేస్తాం?... రాత్రి సినిమాకు వెళ్ళాను..."

అతని బ్రతుకు దారిలో మళ్ళీ రెండు కాళీ రోజులు. .... ఎంత నిరాశలోవున్నా, ఏదో చిన్నఆశారేఖమెరవడం జీవితానికి తప్పదేమో...? కేవలమూ ఆశా, లేక కేవలమూ నిరాశ అన్న అవిరామతత్వాలు కవుల కావ్యాల్లోనే కనిపిస్తా యేమో?... అంత నిరాశలోవున్నా అతను చిన్న చిన్న ఆనందాల కోసం ప్రయత్నిస్తూనేవున్నాడు. కనుకనే...

...జూన్— ఒకటి, లక్ష్మివారం, జ్యేష్ఠబహుళ విదియ - పిన్నిగారింట్లో విందుచేసుకొన్నాం; శ్రీరావుతో సహా!"

ఆసుపత్రిలో భార్య చావుబ్రతుకుల మధ్య తారట్లాడుతోంది. మగతలో, గుడ్డి వెలుతురులో బ్రతుకు రక్షించుకోజూస్తోంది. భయంకరంగా వీచే మృత్యు ఝంఝామారుతంలో కొడిగట్టిన ప్రాణ దీపాన్ని కాపాడుకో యత్నిస్తోంది. కాని, అతడు మాత్రం ఆశనిరాశల మధ్య వూగిసలాడుతూనే వున్నాడు. చిన్నచిన్న విందులూ, గోవిందులూ జరుపుకుంటూనే వున్నాడు. వీలైనప్పుడల్లా, బహుశా-టర్నర్సు ఫౌల్ట్రీకి వెడుతూనే వుంటాడు. బంగాలీయువతి డాక్టర్ శ్యామని కల్సుకుంటూనే వుంటాడనికూడ మనం భావించ డంలో అన్యాయం ఉండదు. కాని, ఈ విషయం మాత్రం అతని డెయిరీలో, చిక్కనిరేఖలతో చిత్రింప బడలేదు. మంచిచెడ్డలూ, ఆశానిరాశలూ, సుఖ దుఃఖాలూ వంటి ద్వంద్వాలన్నీ అతి సాదా విష యాలకిమల్లేనే గుర్తించుకున్నాడు. ... కాని

..."జూన్ - రెండు; నాజీవితంలో ఈరోజంత చెడ్డరోజులేదు. ఈ భయంకరత్వాన్ని, హృదయ క్షోభని, నాజన్మలో మరచిపోలేను. కమల నన్ను చాలా కోపపడింది. నేను డబ్బుని ఏదోమాయగా ఖర్చు పెట్టేస్తున్నానట! కాని డబ్బును ఏం మాయం చేస్తున్నానో నాకే అర్థంకాదు. రాజు కూడా ఆమెగొంతులో గొంతుకలిపాడు. 'కారణా లేమైతేనేం...నువ్వు శ్యామయింటికి తరచుగా వెళ్ళకూడదు.' అన్నాడు. నేను ఎవరినీ చూడ కూడదు. ఎవరింటికి వెళ్ళకూడదు! ఆఖరికి పిన్ని గారింటికి కూడానా?—హరి భగవాన్! బుర్ర గిరగిరా తిరిగిపోయింది. పెళిల్లుమని కపాలం పగిలి పోతుందేమో నన్నంత తలనొప్పిప్రారంభించింది.."

అని కాస్త ముదురురంగులో చిత్రించుకున్న పాండురంగారావు మనస్తాపంమాత్రం నాకుస్పష్టం గానే కనిపిస్తోంది. కమల..... కేవలమూ మృత్యు ముఖంలోకి ప్రయాణంచేస్తున్న కమల...భర్తజీవిత వ్యాపారాన్ని పసిగట్టినట్టుంది. సహజమైన ఈర్ష్య, మండే క్రుంగించే ఈర్ష్య!...నిజానికతను దుబా రాగా ఖర్చు పెడుతున్నాడన్నది ఆమె ఉద్దేశం కూడా కాదు. ప్రస్తుతం డబ్బుసమస్య ఒక్కటే వారిద్దరి జీవితాలకీ సంబంధించినది. కనుక దాన్ని పురస్కరించుకునే అతన్ని చివాట్లుపెడితే—తన మనస్సుకు కొంతశాంతి; గుండెల్లో గుబులుకొనే బాధ ఉపశమిస్తుంది. అంతే పాపం, అంతకన్నా

ఆమెకుకూడా వేరే దురుద్దేశమేమీలేదు...ఇంతకీ ఈరాజెవరు? అతనామెతరపు దగ్గరచుట్టమేమో...

..."జూ౯-3-శనివారం, నిన్నటి సంఘటన లను గురించి బాధతో భారంతో ఈవేళ వ్రాసు కుంటున్నాను. అబ్బా! గుండె ఆగిపోకూడదూ?..."

..."జూ౯-4 : పిన్నిగారింటికి వెళ్ళలేదు..."

..."జూ౯—5 : ఆమెకోసం మందులు కొన్నాను. టవలు మూడణాలు, కాజేజి పావలా ముక్కానీ..."

పాపపు మాటలెందుకు? పాండురంగారావు అనవసరమైన దుబారా ఖర్చులేమీ పెట్టడంలేదు. ఏంకొంటే అది తక్షణం తనడెయిరీలో వ్రాసు కుంటోనే వున్నాడు. అతని డెయిరీలో పుష్క లంగా కనిపించే జమాఖర్చుల జాబితాలే ఆవిష యానికి సాక్ష్యమిస్తాయి. అయినా అవి కారుచౌక రోజులు. పంచదార వీసె పావలా; రెండు కోడి గ్రుడ్లూ బేడ...అరబస్తా సన్నబియ్యం ఐదురూపా యిల పదణాలు...

...."జూ౯-పది-శనివారం, జ్యేష్ఠ బహుళ ఏకా దశి. జీవితం నికృష్టంగా సాగుతోంది. దైన్యమూ హైన్యమూ రాత్రింబవళ్ళయ్యాయి. ఈదుఃఖ భారాన్ని మోయడంకన్న చావడం వేయిరెట్లు నయమనిపిస్తోంది—

'దీర్ఘవిరహం జయిస్తుంది ప్రేమను
కానీ, ఓ మనిషీ—
నమ్మూ నమ్మకపో, నామాటను.
ప్రయత్నించాను; అయ్యో జీవితమంతా
ప్రయత్నించాను; పరీక్షించాను
నా సర్వశక్తులనూ !...
కానీ నిజం మరువలేకపోతున్నాను...'
—యస్. డబ్ల్యు. థామస్."

నాటి డెయిరీకాగితంలో అతని మనస్తాపానికి ఊతగా థామస్‌కవి యింగ్లీషు పద్యాన్నికూడా ఉపయోగించుకున్నాడు. ఆంగ్లపద్యానికి నా ఆం ధ్రానువాదం అసంతృప్తిగానే వుంది. ఏంచేయను? ఏభాష కవిత్వాన్ని ఆభాషలో వింటేనే సొగసూ, రుచీ, ఆనందమూను!

ఆనాటి అతని హృదయ పరితాపాన్ని, తీరం లేని లోతుల్లోకి కూరుకుపోతూన్న మన స్థితిని నాలుగుపాదాల యింగ్లీషు పద్యంతో పోల్చు కున్నాడు. ... నిరాశ దవానలంలా వ్యాపిస్తోంది. ఆధారపడుతుందన్న ప్రతీకొమ్మా భగభగ మండి పోతోంది. కనుకనే దుర్భరమైన ఈ వెనుగులాట కన్న చావడమే మంచిదని నిర్ణయించుకున్నాడు. నిర్ణయించుకోవడం తేలికే! సుఖంగా బ్రతకడం లాగానే సుఖంగా చావడంకూడా కష్టమే!

థామస్‌కవి వ్రాసిన ఈ ఆంగ్లపద్యాన్ని పాండు రంగారావు తనదినచర్య ఉల్లేఖించు కోవడంలోగల భావమేమిటి? ఏ దీర్ఘవిరహం ప్రణయాన్ని జయిస్తుంది? వ్యాధిపీడితురాలైన కమల విర హమా? లేక తన బ్రతుకు మీద పడ్డ పిడుగు పాటునుంచి తెప్పరిల్లి, తీయని సంగీతాల అను భూతుల్ని వెదుక్కుంటూ ఆశ్రయంపొందిన బంగాలీ లేడీడాక్టర్ శ్యామకీ తనకీ ప్రేమ ముది రిందా?... చూపులనుంచి అనుభూతుల వరకూ ఎదిగిందా? ఎదిగి ఎదిగి విరహంగా పరిణమిం, చిందా?...ఏమిటీ.... ఈగొడవంతా ఏమిటి?.... నాకు కలిగిన అనంతమైన సందేహాలను తీర్చడానికి అతని డెయిరీ ప్రయత్నించలేదు. కాని నేను మొదట్లో అనుకున్నట్టుగా పాండురంగారావు మామూలు సాదా మనిషి మాత్రంకాదనీ; విద్యా విజ్ఞానాలతోటీ, కళలతోటీ, సంబంధంఉన్న రసజ్ఞుడే ననీ అర్థంచేసుకోక తప్పిందకాదు.

ఈమాటు స్పష్టంగా, అతని పల్చని బుగ్గలూ, సోగతేరిన ముక్కూ, ఆలోచనలతో యాతన లతో భౌతిక మానసిక సమస్యలతో సతమత మయ్యే అతని నుదుటిమీది రేఖలూ అతి సన్ని హితంగా కనిపించ నారంభించాయి. అంతేగాదు సుమారు నాలుగేళ్ళకాలం తనతో కలసిమెలసి జీవించిన కమల జీవితం సుడిగుండంలో పడ్డం అతన్నిసమూలంగా క్రుంగదీస్తోంది. పాపం—కమల,

భర్తతో కలసి ఎన్నో కలలుగన్న కమల ... సన్నపోగారుతో మలచిన కాంస్య విగ్రహంలా మెరిసే కమల... తపించిపోయే హృదయానికి తన సాన్నిహిత్యంతో చలువపందిరిలా ఆశ్రయమిచ్చిన కమల జీవితమంతా అతనికొక సమస్యగా మారిపోయింది. ఇంత అందానికి, ఇంత నైర్మల్యానికీ, ఇంత పవిత్రతకీ ఎక్కడ దాపురించిందో పాడురోగం.... అతని మనస్సు అగ్నిగుండంలో పడి ఘూర్ణిల్లిపోతోంది!....అంతేకాదు, అతని జీవితానికి సంబంధించిన మరొకవిషయం కూడా సుబోధకమైంది నాకు; కేవలమూ జబ్బుపడ్డకమలకు వైద్యసౌకర్యం కలిగించే నిమిత్తమే విశాఖపట్నం వచ్చినవాడు కాడతను. ఆ వూళ్ళోనే స్థిరనివాసమేర్పరచుకున్నవాడే... ఉద్యోగంవల్లనో మరేవ్యాపకంవల్లనో అతని డెయిరీ స్పష్టంచేయడంలేదు. ముఖ్యంగా అతను విశాఖలోనే జీవిస్తున్నాడనటానికి జూన్ 11 వ తేదీ డెయిరీలో వ్రాసిన— "యింటిఅద్దె ఆరునెలలకు తొంభై రూపాయిలు యిచ్చిన"ట్టున్న విషయం ఆధారపడుతోంది....

" ...జూన్ పన్నెండు. కమలకు భయంకరమైన దగ్గు వస్తూనేవుంది. మధ్యాహ్నం ఒంటిగంట వరకూ ఎడతెరిపిలేని దగ్గుతో బాధపడుతూనేవుంది. జ్వరం కూడ జాస్తీగానే వచ్చింది. ఆమె బాధ చూడలేకపోతున్నాను..."

తరువాత ముప్ఫయ్యొనిమిది డెయిరీ కాగితాల్లో మాత్రం అతని జీవితానికి సంబంధించిన ఏ వివరాలూ లేవు. మిగిలిన పుటల్లో మొత్తం ఏడువందల యెనభై రూపాయలకు ఖర్చుల జాబితాలు మాత్రం ఉన్నాయి. జీవితమనుక్షణమూ తెలిసో తెలియకో ధనపిశాచి అడుగులకు మడుగులొత్తడం ఏవిధంగా తప్పదో అతని డెయిరీలోని ఖర్చుల జాపితా రుజువు చేస్తుంది...తరువాత ఒకనాడు:

..."ఆగస్టు...16...బుధవారం......శ్రావణ అమావాస్య. రాత్రి సరిగ్గా ఏడున్నర గంటలకు ఆమెకు స్మారకం తప్పింది. పదినిమిషాలు గడిస్తేనే కాని మళ్ళీ తెలివి రాలేదు....కటిక అమావాస్య నా బ్రతుకుమీద నల్లని నీడల్ని బరపుతోంది..."

కమల వ్యాధి తీవ్రరూపం ధరిస్తోందని అర్థమవుతోంది. తెరపు మరుపులుగా స్మారకం తప్పుతోంది. పాండురంగారావుకు మానసిక యాతన అధికతరమౌతోంది. అందువల్లనే తన మనస్తాపాన్ని నిర్జించడం కోసమే సిగరెట్లు కాల్చడం, వక్కపొడి నమలడంవంటి చిల్లర వ్యసనాలు అధికమయ్యాయి. ఆ విషయం కూడా అతని డెయిరీ కాగితాల్లోని జమాఖర్చుల మూలంగానే వ్యక్తమవుతూన్నది.

...."ఆగస్టు-28-బుధవారం రెండురూపాయలు బదులు చేశాను...."

అని మాత్రమే వున్న అతని దినచర్య విషమ పరిస్థితులకు తట్టుకోలేని ఆతని ఆర్థిక పరిస్థితుల పతనానికి సూచనప్రాయమవుతోంది....మళ్లీ అతని డెయిరీలో రెండునెలల కాలం కేవలమూ జమాఖర్చుల జాబితామాత్రమే వ్రాయబడివుంది....

డబ్బు........డబ్బు........డబ్బు! దుబ్బుమీసాల రక్కసిలా ఈ డబ్బు ఎక్కడపడితే అక్కడే మానవ హృదయ మార్దవాలపై విషఝుంఝులు క్రక్కడం తప్పదుకాబోలు! అబ్బా, ఈ డబ్బుసమస్యే మానవులకు లేకపోతే—మానస సరోవరాలలో ఎంతటి అమరకమలాలు వికసించగలవో? ఏమైతేనేం— తప్పని కీడుగురించి ఎంతని వ్యథపడగలము? కనుకనే తర్వాత...

అక్టోబరు 22 సోమవారంనాడు 'శ్రీ. వి. ఆర్.' తనకు అయిదురూపాయిలు బదులిచ్చారనీ, మళ్ళీ అక్టోబరు 26 తేదీన కూడా వారే ఎనిమిది రూపాయలు బదులు యిచ్చారనీ—మాత్రం వ్రాయబడి వుంది... అంతే!

కమలకు సంభవించిన భయంకరవ్యాధి ఏస్థితిలో వున్నదో అతని డెయిరీలో వివరించబడలేదు. బంగాలీ అమ్మాయి శ్యామనలపుల వానజల్లు చిలికి చిలికి గాలివానగా మారిందో లేదో కూడ అతని డెయిరీ వ్యక్తీకరించడంలేదు. మానవ జీవితంలో ముప్పాతిక మూడువంతులు ఆర్థికవిషయాల ప్రాబల్యం రాచరికం చేయడం తప్పనట్లే ఆతని డెయికినికూడ జమాఖర్చుల జాపితాలే అత్యధిక భాగం దురాక్రమణ చేశాయి. కమల జబ్బుతో చుక్కాని లేని నావలా ఊగిసలాడిపోతున్న అతని మనసు తన వ్యక్తిగత విషయాల దినచర్యలలో కూడ సరిగ్గా ప్రతిబింబించడంలేదు.

అలాంటి మానవుని మనస్సముద్రపు అఖాతాలను ఏ సాహిత్యం, ఏకళ ఏసంగీతం మాత్రం సంపూర్ణంగా ప్రతిబింబించగలదు?

మాదిరాజు రంగారావు

# మనోభూమికలు

## 1

ఎక్కడి కక్కడే దూర దూరంగా
వాలిపోయి కంటికి కన్పించని నభస్సు
విరామ మెరుగని అశాంతి గీతం
విన్పిస్తూ ఎప్పటికపుడు వెళ్ళిపోయే వాయువు

ఏనాడో తెగిపోయి హఠాత్తుగా
ఆలోచనా స్ఫూర్తిరేఖల సంబంధం
ఆకృతిలేని కదలిక ఎరుగని
మసకకళ్ళు మూతబడని అంధకారం

ఇసుక ఎడారి నాలుకచాచి
దూరంగా సరస్సులా కన్పించే
చంద్రబింబంవైపు పరుగుతీస్తూ
ఎంతకాలానికీ అందుకోజాలని భూమి.

నిలువడానికీ సూదిమొన అంతైనా
సన్నని వెలుగుదారుల విస్తృతి
రక్షణకై పరితపించు బ్రతుకులు
ప్రతి అంగుళం అంగుళంమేర నేలను

మ్రింగి వేయడానికి జలబిందు సమూహంగా
మాటి మాటికి ఉత్సహించు సముద్రం.

జ్వలదగ్ని సమోహా సంభ్రాంతిమత్
సంధ్యాటవీ ధావన్మృగ పక్షి సమూహము

రవిబింబ సమాచ్ఛాదిత మేఘమండలీ
కల్పిత ఛాయా వాగురా విపతిత జీవరాశి

ఉన్మాద ప్రలపనా సముద్భ్రమన్మరుదావళి
మరుదావలీ సంచాలిత నిర్యూహావృక్షావళి

అశాంతి ఆనందంతో నగ్ననృత్యం చేయు
యుద్ధోన్మాదిని పిపీవాలి రాక్షసీ అట్టహాసం.

## 2

ఆకాశ ముఖంపై సంధ్యా ప్రశ్నలవలె
స్పర్శగుణం, చలనశక్తి, వ్యక్తిత్వంలేని
నడిచే నిలువు నీడల మూకలు—
వేగ గమనశీలి కాలం వదిలిన ముద్రలు.

అగ్నితో మాసిపోని ఊహలతో పూడ్చబడని
మానవుని ప్రగతి చరిత్రలో చీకటి లోయలు

నిశ్శబ్దం సమావరించిన శిలావిగ్రహాల
పాదాలముందు రాలిన కన్నీటి చుక్కలు
పర్వతాల హృదయ కర్కశ స్వభావాన్ని
సంగీతంతో సముద్రానికి చేరవేసే నదులు.

రాత్రి—
సహజావేశంతో నాలోని అంతశ్శక్తిని
తనవశం చేసుకుని ఆనందించే నిద్రలో
అంతలో అంతమై మస్తిష్కంలో ఆరంభించు
స్వాప్నిక సన్నివేశాల బలమైన సంఘర్షణ

ఉదయం—
కంద గడ్డలా మారిన ముఖంతో మేల్కొని
హిమావృత సూర్యబింబ రూపంలో నిల్చిన
వెలుగు గుడిని చూచే చీకటి కళ్ళలో
తేలే చిన్నిచిన్ని పడవల్లా నిప్పురవ్వలు.

## 3

ఉదయం అరున్నర, విరిసిన జన సంచలనం
మతిపోయిన చంద్రుని ఆలోచనల లిపి
అర్థరహితమై మాసిపోయినవేళ
సూర్యుని విశాల హృదయంపై వ్రాలిన
సర్వ జగత్తు భయశోకం మరచినవేళ

వెలుగుపోయి బీతు బీతుగా ఒంటరిగా
నగరంలోని దీపస్తంభాల చాటునుండి
వీణాశ్రుతులలో విన్పించని దీనస్వరాలు
వంకరలు తిరిగిన సూదులవలె చూపులు

క్రుంగిన భూమీతలంపై
పాములు విడిచిన పుట్టవలె
కోర్కెలు ఫలించని ఇసుక దిబ్బవలె

సంధ్యాగ్ని కీలలకు పొగబారి
తెల్లదనం నశించిన ఆకాశంవలె
నేలవాలి పూర్తిగా అతికిపోయి

మన్వంతరాలుగా పరిక్రమించిపోవు
జగన్నాథ రథచక్రాలు పట్టుకొని
మృత్యువు ఊహలతో వదలని చీకటివలె
నీడలు వదలి పోలేని శైశిరాకారాలు.

సాంఘిక సమభావ స్థితికి అందుకొనని
అన్నజీవుల ఆరాటం - ఆరని కాష్ఠంవలె
జీవితం క్రతువుగా పరిణమింపజేయు
మనోప్రాణి ఆవేదన - జ్వలించే సప్తార్చివలె

## 4

పట్టపగలు—
అగ్నిపర్వత శిఖరం ఒరిగి పడినట్లు
తనపై ఆకాంక్ష లోకంపై మమకారం
ప్రక్కవాడితో జీవితంలో అజ్ఞానంలో పోటీ

నిశాఽగమన సంధ్యాసమయం—
జాతులు జాతులుగా, మాలలు మాలలుగా
ఇతస్తత ఉడ్డీన విహంగమ సమాకీర్ణమై
చివరలు నీలీకృతమౌ విలోచన పథము
విశ్రాంతికోరు నిరంతర యాత్రిక సమూహము.

పైన అన్నపు మెతుకులవలె చుక్కలు
క్రింద విద్యుద్దీపం చుట్టూ కలవరించు చీకటి
తానై మేల్కొనదు - ఎవడైనా మేల్కొల్పితే
నిప్పంటిన రాక్షసిబొగ్గు - విప్లవం.

## 5

ఆకాశానికి భూమికి మస్తిష్కానికి మనస్సుకు
ముఖ్యంగా తనకైనా తన పరిణామము తెలియని
—పరిణాహ రోదసి.

మానవుని ఇష్టాఽపూర్తికి చిట్టచివరిదశ
ఈశ్వరుడు అతని పాదాలముందు
అవనత మస్తక సోపాన పంక్తి వలయం
అతని శిరఃపదము మీరి దాటిపోగల
తమలోని ఆత్మభావం తెలియని జీవులు

పరివర్తన చెందని అనాది వారసత్వ చిహ్నాలు
సుత్తెల మ్రోతలునోకి ఎరుగని కొండరాళ్ళు
ఋతు పరివర్తన శక్తికి నిల్వలేక నశించు
ఆకురాలుపు, చిగుర్పు, పెరుగుదల ఎరుగని
—గడ్డిపోచలు

జీవితాంతం వెల్గుతూ త్రైగుణ్య విపర్యయంతో
అసంపూర్తి కామనలతో చల్లారని మనఃశ్మశానం

కళానుభూతిలో, లౌకిక వలయంలో
ఆనందం దుఃఖం పేరిట నగ్నంగా
ఉద్విగ్నంగా దీప్తమతికి గోచరించు
అశాంతి గోళక వివర్త దృశ్యాలు

కాల నియమం లేకుండా సంచరిస్తూ
అజ్ఞాతంగా అద్దంవంటి బుద్ధిలో
అవిజ్ఞేయంగా బింబించు మనోభూమికలు.

సు[ప్రసన్న |

# సంస్కృతరూపకముల అనువాదములు - 2

(గతసంచిక తరువాయి)

ము[ద్రారాక్షసమునందు:

క్షైయాః రహశ్శంకిత మాలపన్తః
సుప్తా రుగార్తా మదిరా విధేయాః
[త్రాసో మృగాణాం వయసాం విరావో
నృపాంక పాద [ప్రతిమాశ్చ యత్ర (అ-2)

అలుకుచు నెవ్వరెవ్వ రెటు
లాడినగాని రహస్య వృత్తముల్
చులకన చూడరాదు, మఱి
సుప్తుల రోగుల నార్తులన్వన
స్థలమున నేమఱంజనదు,
జంతుల[త్రాసము పక్షికూతలున్
గలిగిన చోట్ల [శద్ధగనగా
వలయుఁ నృపపాద చిహ్నముల్.

అని బులుసువారి యనువాదము. మూలము నందున్న సంగ్రహముగచెప్పు గుణ మిందు లేదు. జంతుల[త్రాసము. పక్షికూతలును అన్నవి సుంద రములైన శబ్దరూపములు కావు. జంతువుల [త్రాసము, పక్షులకూతలుఅన్నవి సాధురూపములు. (వ్యాకరణరీత్యా చెప్పుటలేదు.) ఒక్క క్షైయ శబ్దమువలన మూలమున సాధించిన యర్థమును అనువాదకుడు మూడు నాలుగుక్రియలు వాడి సాధించినాడు. 'ఈపద్యమందర్థమగు గుణమున్నది. అదే పదివేలు.

ము[ద్రారాక్షసములో నొకచోట మంత్రులకును నాటకకర్తలకు పోల్చుట యున్నది. అందువాడిన శబ్దములలో నెన్నియోశబ్దములు ఈరెండువిధము లైన యర్థముల సాధించుటకు సమర్థములై యున్నవి.

కార్యోపక్షేపమాదౌ తను మతిరచయం
స్తవ్య విస్తార మిచ్ఛఁ
బీజానాం గర్భితానాం ఫల మతిగహనం
గూఢ ముద్భేదయంశ్చ
కుర్వన్ బుధ్యా విమర్శం [ప్రసృతమపి పునః
సంహరఁ కార్యజాతం
కర్తావానాటకానా మిమ మనుభవతి
క్లేశ మస్మద్విధోవా."

తొలుతం గార్య మొకింతయుం బిదప
నెంతో పెద్దయుంజేసి, యా
వల బీజంబునకుఁ నిగూఢదశ
పోవంజేసి, య్యాపై విమ
ర్శలు గావించియు, విస్తృతంబయిన
కార్యంబుఁ ముగింపించు వా
రలు క్లేశంబువహింప దృశ్యకృతి
కర్తల్ తోడు మాబోంట్లకుఁ

అని [శ్రీతిరుపతి వేంకటకవుల యనువాదము. కవి యిచ్చట అద్భుతతరనీతివిషయిక స్వసం విధాన క్లేశములను రాక్షసవచన వ్యాజముచేత [ప్రస్తావించుచున్నాడు. మొదట కార్యోపక్షేప మును, బీజన్యాసమును ముఖసంధియందు రచిం చును. ఈశ్లోకమునందంతయు ఈ భావధార ననుసరించి నాటకీయ పరిభాష వాడబడినది. ఈ నాటకీయమైన యర్థము [ప్రధానకథాసంబంధి కాదు. అచ్చట రాక్షసుడు కార్యనిర్వహాణ మందలి క్లేశమును చెప్పుటయే [ప్రధానము. ఒకవేళ యనువాదకుడు [ప్రధానముకాని యర్థ మును వదలివేసినను దోషము కానేరదు. కాని దానిని స్వీకరించినపుడు [ప్రాధాన్య వివక్ష

చెడకుండ సమర్థముగ నిర్వహింపవలయును. బీజానాం గర్భితానాం అన్నచోట గర్భసంధి ఉద్దిష్టము. అనువాదకు లా శబ్దమును వదలినారు. విమర్శ శబ్దమునకు 'విమర్శలు గావించి' అని చెప్పినారు. ఇచ్చటి బహువచనము విమర్శ శబ్దములోని విమర్శసంధియన్న యర్థమును భరించుచున్నది. ఇది అనువాదకులు చేయు మరియొక రకపు దోషము.

ముద్రారాక్షసమందే

"సోత్సేధైః స్కంధదేశైః
ఖరతర కవికాకర్షణా దర్థభుగ్నై
రశ్వాః కై శ్చి న్నిరుద్ధాః
ఖమివ ఖరపుటైః ఖండయన్తః పురస్తాత్".

అన్నదానిని

"కవికాకర్షణ విస్తృతాంగముగ
డెక్కల్ మిన్నుఖండించు కా
లి వడింపోవు గురాల"

అని తిరుపతికవుల యనువాదము. మూలమునందలి యుత్సేధశబ్ద మనువాదమునందు విస్తృతమయినది. ఈ రెండు సమానార్థకములు కావు. కళ్లెము పట్టిలాగిన గుఱ్ఱముయొక్క స్కంధదేశ ముత్సేధమగుటలోనే గాని విస్తృత మగుటలో రమ్యతలేదు.

మహావీరచరిత్రమున మాల్యవంతుడు శూర్పణఖతో యిట్లనును.

"ఉత్పత్త్యైవ హి రాఘవః కిమపి త
ద్రూపో జగత్యద్భుతం
మర్త్యత్వేవ కిమత్ర యస్య చరితం
దేవాసురై ర్గీయతే
వస్తుస్వాదధతేచ శక్తిమృషయో
దేవాశ్చ తర్కేత్యతరాం
మర్త్యాదేవవరప్రదానసమయే
బ్రహ్మేశయం నో జగా"

దీనిని మల్లాది సూర్యనారాయణశాస్త్రిగా రిట్లనువదించిరి.

మానవమాత్రుడా నిరుపమానుడు
రాముడు, శుద్ధసత్త్వ వి
జ్ఞాన ఘనాత్మ తత్త్వమని
సర్వసురాసురు లెంతు రాతనిన్
మౌనులు సర్వశక్తులు
సమర్పణ చేసిరి వీని కింతకున్
మానవభీతి లేదనియె
నా విధి జేనికి కోర్కు లిచ్చుచోన్.

ఇది మూలవిధేయమైన యనువాదముకాదు. ఇందు మాల్యవంతుడు "రాముని చరితమును దేవాసురులు పాడుచున్నా" రన్న భావమును "శుద్ధసత్త్వ విజ్ఞాన ఘనాత్మతత్త్వముగ సర్వసురాసురులెంతు రాతనిన్" అని అనువాదము. మాల్యవంతుడు పలుకునప్పుడు ఈ విధముగా రాముని పరబ్రహ్మ విషయికమైన వ్యాఖ్యచేయుట సమంజసముగా లేదు. అసురు లాతని చరిత్రమును కీర్తించుట కాతని చరిత్రమందలి అద్భుతమే కాని వేఱొండు కారణము కాదు. "తద్రూపో జగత్యద్భుతం" అన్న మాటను "నిరుపమానుడు" అన్న విశేషణము సాధింపలేదు. ఇది మూలమును సరిగా పాటింపకపోవుటవలన కలిగిన దోషము.

ఒక్కొక్కచో మూలమునందలి కొన్ని యంశములు తొలగిపోవును. అయినను దానియందలి ప్రధానార్థము దెబ్బతినదు. అప్పుడది లోపముగా నెంచబడదు.

విక్రమోర్వశీయమునందు—

"ఇదం తస్యాః రథక్షోభాత్
అంసే నాంసం నిపీడితం
ఏకంకృతి శరీరేస్మిన్
శేష మంగం భువోభరః"

"ఆమె బుజముతో రాపిడి నందినట్టి
భుజ మ దొక్కటి మాత్రమె పూతమయ్యె
నీ శరీరమునందంచు నెంతు నేను
దక్కిన యవయవము లేల ధరణియందు?"

అని శ్రీ నండూరి రామకృష్ణమాచార్యులుగారు అనువదించిరి. ఈ అనువాదమందు మూలమందలి రథక్షోభాత్ అన్న భాగము తొలగినది. ఇది కేశి రాక్షసునినుండి ఊర్వశిని రక్షించిన రాజు ఒక రథమందు ఊర్వశితో కూర్చున్నప్పుడు పొందిన పరస్పర భుజస్పర్శానుభూతివిశేష మిందు వర్ణింప బడినది. ఇది ఈ శబ్ద మచ్చట నున్నచో స్ఫురించును. లేకున్నచో స్ఫురింపదనికాదు. అందువలననే దీనిని దోషమని చెప్పుటలేదు.

స్వప్నవాసవదత్తములో—

"వివాహ మోదసంకులే అంతఃపుర చతుశ్శాలే పరిత్యజ్య పద్మావతీ మిహాగతాస్మి ప్రమాదవశాత్ యావ దిదానీం భాగధేయ నిర్వృత్తం దుఃఖం వినోదయామి" అన్న దానికి చిలకమర్తివారు "పద్మావతిని వివాహమోద సంకులమగు నంతఃపుర చతుశ్శాలలోవిడిచి నేనీ ప్రమద వనమునకు వచ్చితిని, ఇప్పుడు నా భాగధేయ నిర్వృత్తమగు దుఃఖము నపనయించు కొనియెదను" అనియు శ్రీ కాటూరివారు "అంతఃపుర చతుశ్శాలలో పెండ్లిసందడిలోవున్న పద్మావతిని వదలి, యిలా ప్రమద వనంలోకి వచ్చాను—నావంతుకు వచ్చిన దుఃఖాన్ని యిక్కడ దిగమ్రింగుకోవచ్చునని" అని అనువదించినారు. ఈ రెండు అనువాదములలోను చాలభేదము గోచరించుచున్నది. చిలకమర్తివారి రచన సంస్కృత వాక్యములకు తెలుగు ప్రత్యయములు చేర్చినట్లున్నది. ఆవాక్యములు నాటకములలో భాగము అప్పచెప్పు నటుల సంభాషణములవలె నిస్సారములై యున్నవి. కాటూరివారి వాక్యములలో తెలుగు పలుకుబడి వెల్లివిరిసినది. వివాహమోదసంకులమన్నమాట తెలుగులో పెండ్లిసందడియైనది. దుఃఖమును దిగమ్రింగుకొనుటకూడ తెలుగు పలుకుబడి ఎఱిగినవాడు రచించునదే.

కొన్నిచోట్ల కొన్నికొన్ని శబ్దములయందు వాని యావృత్తియందు రమణీయార్థము స్ఫురించును. వానిని మార్చికాని పర్యాయముల తగ్గించికాని లాభములేదు. "యుధిష్ఠిర. యుధిష్ఠర అజాతశత్రో అమిథ్యావాదిన్ ధర్మపుత్ర సానుజస్య లేకిమనే నాపకృతమ్" ఈవాక్యము పితృవధవిన్నఅశ్వత్థామదుఃఖించునప్పటిది. వేణీసంహారములోనిది. దీనిని "ఓయీ యుధిష్ఠిర! అజాతశత్రూ! సత్యవాదీ! నీకును నీతమ్ములకును నాతండ్రి యే యపకారము చేసెను?" అనిబులుసు వేంకటేశ్వరులుగారనువదించిరి ఓయి అన్నది మూలమున లేదు. ఒక విధమయిన దుఃఖమున ఓయి యన్నది చేర్పబడవచ్చును. అది శాంతించిన లేక శాంత్యున్ముఖమైన దుఃఖమునందు. కాని అశ్వత్థామ దుఃఖ మట్టిదికాదు. యుధిష్ఠిర శబ్దము రెండుసార్లు వాడబడినది మూలమున. అది అనువాదకుడుతగ్గించినాడు. పేరుపెట్టివీరునిపిలుచుచునట్లున్న దా సంబోధనము. చిన్నప్పటినుండియు తన తండ్రివద్ద చదివినవారు. కావున ఆయన కంత చనవు కలదు. అది క్రోధసమయమున నట్లు రెండుసార్లు పిలుచునట్లు చేసినది. కాని అనువాదకుడు దీనిని గమనింపలేదు. అమిథ్యావాది యన్న సంబోధనమందు మిథ్యావాదియన్నధ్వనియున్నది. దానిని సత్యవాది యన్నది స్ఫురింపజేయదు. అనగా దానియంత శక్తిమంతము కాదనుట. సత్యవాదిలో లేని వ్యతిరేకార్థకము అమిథ్యావాది యన్న మాటలో నున్నది. ఇది కవియొక్క శబ్దశిల్పము. అనువాదకుడు భావమును గ్రహించెనే గాని మూలములోని ఉద్వేగమును గ్రహించలేదు. అనువాదము చేయుటకుముందా కావ్యము నెన్నియో మారులు మననము చేసి భావింపవలయును. అట్లుచేయకపోవుటవలన దోషములు సంక్రమించును. సంస్కృత రూపకములలోని పద్యములతోపాటు వచనము కూడ తెలుగులో చప్పగా వచ్చుటకు అనువాదకుల అశ్రద్ధయే కారణ మనక తప్పదు. కాక వీనివలన మన నాట

కములకు కృత్రిమమైన యొక వచనరచనము సంప్రదాయమైనది. అది సంక్రమించిన ఫలము. కర్ణభారములో—

"శిక్షాక్షయం గచ్ఛతి కాలపర్యయాత్
సుబద్ధమూలా నిపతన్తి పాదపాః
జలం జలస్థానగతంచ శుష్యతి
హుతంచ దత్తంచ తథైవ తిష్ఠతి"

అన్నదానికి శ్రీ కోపల్లె శివకామేశ్వరరావుగారు చేసిన అనువాదము :

కాలపర్యయమున శిక్ష క్షయమునొందు
విఱుగును సుబద్ధమూలముల్ వృక్షములును
లలిత నీరాశయగతమ్ము జలములింకు
నిచ్చినది వ్రేల్చినది యొప్పు డెసగుచుండు.

ఈ అనువాదము చక్కగా నున్నది. యథామూలముగ, అతిక్రమము లేకుండ సాగినది. లలిత శబ్దము వచ్చిపడినది. అది లేనిచో యిది చాల నిర్దుష్టమైన యనువాదమే.

అనర్ఘ రాఘవమున :

"దృశ్యన్తే మధుమత్తకోకిలవధూ
నిర్ధూత చూతాంకుర
ప్రాగ్భారప్రసరత్ పరాగసికతా
దుర్గాస్తటీ భూమయః
యాఃకృచ్ఛ్రదతి లంఘ్య లుబ్ధక
భయాత్ తైరేవ రేణూత్కరైః
ధారావాహి భిరస్తి లుప్తపదవీ
నిశ్శంక మేణీకులమ్"

అన్న శ్లోకమును శ్రీ భువనగిరి విజయరామయ్యగారిట్లనువదించిరి.

"తేనెమదాన గోయిలలు
తేపకు మావిననల్ కదల్ప దో
డ్తో నలిరాజు పుప్పొడుల
దువ్వలు లుబ్ధకభీతి నెట్టి చం
దాననొ దాటు లేళ్ళకు
బదక్షతము ల్వడిఁ గప్పి క్షేమ సం
ధాన మొనర్ప ముచ్చటల
దన్ను ధునీతట భూము లద్దిరా"

ఇది గోదావరీతీరమున పంచవటిని గాంచిన జటాయువు చేయు వర్ణనము. అనువాదమునందు పుప్పొడులులేళ్ల పదచిహ్నములకప్పునన్న యర్థము చప్పున స్ఫురింపదు. కాని భావము దెబ్బతినలేదు. మూలములోని సమాసమును అనువాదమున తేబ్రయత్నించి దానిని మఱింత క్లిష్టము చేయలేదు. ఇంతే—

అభిముఖ పతయాను చిర్లలాట
శ్రమ సలిలై రవధూత పత్రలేఖాః
కథయతి పురుషాయితం వధూనాం
మృదిత హిమద్యుతి దుర్మణః కపోలాః.

అన్న దానిని భువనగిరివారే యిట్లనువదించిరి.

"మొగ మలము చెమటచిత్తడి
నొగి మకరీపత్త్రిరాజి యూడిపడ శ్రమజ
జిగి సనిన కపోలము లిం
పుగ జాటుఁ దరుణిమేలి పురుషాయితముల్"

(భు. వి. రా.)

ఈ అనువాదము మూలానుసరణము కాదు. కేవల భావానువాదమే. ఇందు "మకరీ పత్త్రి రాజి యూడిపడ" అన్న ప్రయోగము సమంజసము కాదు. మకరీపత్త్రిరాజి చెరగిపోవుటయన్న బాగు కాని యూడిపడుట కాదు. ఈయూడిపడుట యన్నది ఇట్టి ప్రదేశములందు వాడుటవలన యౌచిత్యము దెబ్బతిన్నది.

ఇంతవర కనువాదములలోని దోషములను చూపించినాను. ఈదోషములు దోషములుకావని కొందరు వాదింపవచ్చును. అనువాదమన్నచో మక్కికి మక్కిగా చేయుట కాదు. 'సూత్రధారుడు పిలువగా వచ్చిన నటి "ఇయమస్మి" యన్న దానికి 'నేనయితి' ననుమాదిరి భాషాంతరీకరణము చేయవలయునా యని ప్రశ్నింప వచ్చును. అది నాఉద్దేశ్యము కాదు. ఇట్లు వెదకుచు పోయినచో ఈ దోషోద్ఘాటనమున కంతుండదు. వీనిలో కొన్ని

పాఠభేదములవలన దోషములుగా నిరూపింపబడక పోవచ్చును.

ఈ దోషముల నిన్ని రకములని విభజన చేయ వచ్చును. వానికి వేరే వెదుకనక్కరలేదు. సాహిత్య దర్పణాదులలో నున్న దోష ప్రకరణాంశము లన్నియు వీనియందు మన మేరవచ్చును. అనువాద మన్నది యొక తేలికైన ఆటకాదు. తన ప్రతిభా ప్రదర్శనము కాదు. మఱియొక మహాప్రతిభుని యొక్క ప్రతిభను దర్శించుట, వ్యాఖ్యానించుట. కొందరు మొదటిది చేయలేరు. మరికొందరు వేరొకటి చేయలేరు. రెండును చేయగల అనువాదకులు చాల తక్కువ.

కొందరకు తాము చేయుచున్న దోషము తెలియును. కాని వారు అచ్చట చేయునది వేరేమియు లేదు. శ్రీపాదవారొకచో నొక పద్యమున పాండవవధూ శబ్దమునకు బదులు పాంచాలీశబ్దము వాడబడినందులకు పాఠకులను క్షమింపగోరిరి. ఇది వారి చిత్తశుద్ధికి తార్కాణము.

సంస్కృత నాటకములం దుత్తమపాత్రలన్నియు సంస్కృతమును, స్త్రీపాత్రలునీచపాత్రలు ప్రాకృతమును సంభాషింతురు. అనువాదకు డే మార్గ మవలంబించవలయునో తెలియరాలేదు. వీరేశలింగముగారు మొదలైనవారు అందరకును సరళ గ్రాంథిక వచనమునే వాడిరి. శ్రీ కొక్కొండ వేంకటరత్నం పంతులు పరవస్తు రంగాచార్యులు గారు ప్రభృతులు సంస్కృత స్థానమున గ్రాంథికాంధ్రవచనమును, ప్రాకృతస్థానమున దేశ్యమైన అచ్చతెనుగును వాడిరి. ఈ మార్గము తరువాత నెవ్వరును అనుసరింపలేదు. అచ్చ తెనుగుమాత్రమే వాడుటవలన భాషలో కృత్రిమభావ మేర్పడును. శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారు తమ నాటకములలో ఇట్టిచోటులందు వ్యావహారిక భాషను ప్రవేశపెట్టిరి. ఈ మార్గమును తరువాత చాల మంది అనుసరించిరి. దీనినే వారు పాత్రోచితభాష యనిరి. ఈ మార్గముననే గ్రామ్యభాషను కూడ కొన్నిపాత్రలకొరకు వారు ప్రవేశపెట్టిరి. తరువాత కొంతకాలమునకు ఈ నాటకములన్నియు వ్యావహారిక భాషానువాదమును పొందినవి. ఈ అనువాదములందు పద్యములు మాత్రము యథాతథములుగా గ్రాంథికమునందే నిలచిపోవును. కొందరు ఈ బాధకూడా తప్పిపోవుటకు పద్యములను కూడా వచనముగానే మార్చివేసినారు. ఇది నాటకములందలి చివరి దశకు సంబంధించిన విషయము.

నాటకము నటుని వాగ్వ్యవహారము వలన రక్తికట్టును. ఈ వాక్కు లౌకికమైన వ్యవహార సాదృశ్యమున్ననే ఆ పాత్రలు నిజముగా మాట్లాడు చున్న భ్రాంతి కలుగునేకాని నాటకమునందు భాష వ్యవహార దూరమైనపుడు ఈ భ్రాంతి పొంద వీలులేదు. ఇది నాటకము లోని ప్రధాన విషయము. అప్రధానములైన కొన్ని విషయముల (స్వగతాపవార్యాదులు) మనము నాటక రంగస్థలమున కల్పించుకొనుచున్నాము. ఐనను అచ్చటి స్థితి మనము తార్కికముగా ఆలోచించుచునే ఉన్నాము.

నాటకములలోని భాష శిష్టవ్యావహారికమై యుండవలయును. ఈ విషయమును ఏవో కారణములు చెప్పి కాదనుటకు వీలులేదు. శ్రీ ప్రభాకరశాస్త్రిగారి నాటకములలో భాష—ఉదాహరణకు ప్రతిమలో రాజగృహ సంబంధి కావున తన్మర్యాదలు కల భాష— సహజముగానే ఉన్నది. వీలున్నన్నిచోట్ల సహజమైన భాషకు దగ్గిరగావచ్చు ప్రయత్న మిందు గోచరించును. పద్యముల రచనయందును శ్రీ ప్రభాకరశాస్త్రిగారు వ్యావహారిక వాక్కునకు దగ్గరగా వచ్చునట్లు చేసియున్నారు.

సంస్కృత నాటకములలో నున్నట్లు సంస్కృత ప్రాకృతములవలె తెలుగు నాటకములలోను తత్సమ, అచ్చిక భాష లున్నవనుటలో అందమేమియును లేదు. ఈ భాషాభేదము వలన సంస్కృతములో కలిగిన రసస్పృహ యేమియో మనకు

తెలియరాదు కాని తెలుగులో మాత్రము హాస్య కారి యగుచున్నది. అందువలన సంస్కృతనాట కానువాదములయందు సంపూర్ణ వ్యవహారభాష వాడుటయే చాల సమంజసము.

సంస్కృత నాటకములలో నాటక సంబంధము లైన కొన్ని సంప్రదాయము లున్నవి. వానిని యథాతథముగా తెలుగులో దించుటకు వీలులేదు. దానివలన అచ్చటి సొగసు తెలుగులో రాదు.

"నాట్యములోగూర్చుండి" "తనయింట నాస నముమీద గూర్చుండి కోపముతో...చాణక్యుడు ప్రవేశించుచున్నాడు" "నాట్యమున నగలన్నియు ధరింపజేసి" మొదలైన ప్రయోగములలోని నాట్య శబ్దము మూలమందలి నాట్యేన అన్నదాని యొక్క అనుసరణము. ఇది మూలమునం దభి నయార్థమున ప్రయుక్తమయినది. ఇచ్చట కొంద రభినయశబ్దమునుకూడ వాడుచున్నారు. అదియును సమంజసముగాలేదు.

సూత్రధారునిచేత మూలమందు కవి తన్ను గూర్చి చెప్పుకొనుచుండుటకలదు. ఆ చోట కొంద అనువాదకులుతప్ప మిగిలినవారు చాల మంది తమపేరు నిరికించుకొన్నారు. ఇది బాగుగా నుండలేదు. దానికి కారణము సూత్రధార నటీ సంభాషణాదికము ఈ కాలమునాటిదికాదు. ఈ సంభాషణము చదువునప్పటి పాఠకుడు తన్ను ఆ నాటకమునాటి కాలమువాడుగా భావించు కొనును. అందువలన నడుమవచ్చిన అనువాదకుని పేరచ్చట అసంబద్ధముగా గోచరించును. ఇదికాక ఈ నాందీప్రస్తావన సందర్భమున కొందఱుకవులు తమ కాలమునాటి పరిస్థితులు వర్ణించియున్నారు. వానిపై వారి వ్యాఖ్యానము లున్నవి. అవన్నియు నట్లే యున్నప్పుడు అనువాదకుని పేరిచ్చట యతికి నట్లే కానబడునుకాని సహజమైనదిగాగోచరింపదు.

ఈ నాటకానువాదములలో అనేకములైన పద్ధతులనుసరింపబడినవని ముందు సూచించితిని. అందు కొన్ని క్రొత్తమార్గము లనుకొన్నవి సమం జసములుగా కాన్పింపవు. శ్రీ చిలుకుల శ్రీ రాములు గారి "శాకుంతల"తమ యిచ్చవచ్చినట్లు రచియింప బడినది. నాటకము "ఆశ్రమ మృగోయం న హన్తవ్యో నహన్తవ్యః" అనుచోట నించుమించుగా మొదలగును. అంతకుముందున్న గ్రీవాభంగాభిరామ మిత్యాది శ్లోకము లందు పరిహరింపబడినవి. తరు వాతకూడ చాలవరకు సంక్షేపింపబడినది. కొన్ని కొన్నిచోట్ల సుందరములైన శ్లోకములు వదలబడి నవి. ఇదియొకపద్ధతి ననుసరించిన యనువాదము కాదు. మొత్తముమీద యిందలిపద్ధతి దోష భూయిష్ఠముగ నున్నది.

భవభూతి ఉత్తర రామచరిత మాధారముగ శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంత కవిగారు "ఉత్తర రాఘవ"మను స్వతంత్రరూపకము రచించిరి. ఇందు తొమ్మిదంకము లున్నవి. అందు భవభూతి రచనా సౌందర్యము ననుకరించు ప్రయత్నము సర్వత్ర చేయబడినది. ఇది ఏ రకపు అనువాదమో నిర్ణ యించుట కష్టముగానున్నది.

శ్రీ ములుగు చంద్రమౌళి శాస్త్రిగారు మాళవి కాగ్ని మిత్రమునుకూడ ఆధునిక ప్రదర్శనాను కూలముగ అనువదించిరి. ఈ అనువదించుటలో "మహాకవినిర్దిష్టములగుఁ గొన్ని పాత్రముల దగ్గించి యిక్కడక్కడఁ గొంత విషయమును పెంచి కొంత కథను మార్చి........" నట్టులు చెప్పుకొన్నాడు రచయిత.

శ్రీ జూలూరి హనుమంతరావుగారు ఉన్మత్త రాఘవమును సంపూర్ణముగ పద్యరూపమున అనువ దించినారు. ఇది ఆంగ్లేయమైన రూపక రచనా పద్ధతికి అనుకరణ. ఇది ప్రదర్శనమున కనుకూల మైనది కాదు. కాని పద్యరూపక రచనగా మాత్ర మీ ప్రయత్నము చక్కగా నిర్వర్తింప బడినది.

విద్వాన్ విశ్వంగారు కాళిదాస విక్రమోర్వశీ యమునకు ఒక రేడియో అనుసరణ రచించి ప్రకటించినారు. రేడియో అనుసరణలో ఈ

నాటకము తగ్గిపోయినది. కాని రమణీయమైన పురూరవ విరహాఘట్టము ప్రాధాన్యము వహించుట చేత ఇది శ్రవ్యరూపకముగా మిక్కిలి రాణించినది. ఈ దీర్ఘమైన విరహవర్ణనము దృశ్యరూపకముగా రాణించుట కష్టము. విశ్వంగారి రచన ఇందు మధురముగా నున్నది.

ఈ నాటకముల రచనలో కొందరు రచయితలు వహించిన స్వేచ్ఛ సమర్థనీయముగానున్నది. మరి కొందరు మితిమీరిన స్వేచ్ఛ వహించి "మూలచ్ఛేదీ తవపాండిత్యప్రకర్షః" యన్న స్థితికి గొంపోయిరి.

నాటకముల మూలములో కొన్నికొన్ని చోట్ల శబ్దముల శ్లేష వలన కొన్ని విశేషార్థములను రచయిత సాధించును. అవి కథాసంబంధులు కావచ్చును, కాకపోవచ్చును. అట్టి సందర్భమున అనువాదకుడు తన అనువాదమునందా యాశక్తిని తీసుకొనివచ్చు ప్రయత్నముచేయుట మంచిదే. కాని దానివలన మరింత క్లేశమును కలిగింపరాదు.

'ఉదయ నవేందు సవర్ణా
వాసవదత్తా బలౌ బలస్య త్వాం
పద్మావతీర్ణ పూర్ణౌ
వసన్త క్రమౌ భుజౌ పాతామ్'

అన్న స్వప్నవాసవదత్తాశ్లోకమున బలరామ భుజద్వయ వర్ణనముతో పాటు ఉదయన, వాసవదత్తా, పద్మావతి యన్న నామములు కావ్యములోని ప్రధానపాత్రములని ప్రకాశించినవి. కావ్యా వాందిగా కావ్యకథాసూచన చేయుట కవి యుద్దేశ్యము.

ఉదయన వ్యేందు వర్ణత నొప్పుగలిగి
యఖిలవాసవదత్తాబలాఢ్యమగుచు
వా వసంత క్రమమయి పద్మావతీర్ణ
పూర్ణమగు సీరి దోర్ద్వయి ప్రోచుమిమ్ము.
(చిలకుర్తి)

సుమన వాసవదత్తాబలము, వసంత
క్రమ ముదయన వతపాక రసవర్ణ
మైన బలరామదేవు పద్మావతీర్ణ
పూర్ణ భుజయుగ్మ మెపుడు నిన్ బ్రోచుగాత.
(కాటూరి)

ఇవి యిద్దరి యనువాదములు.

కథావిషయక పాత్రనామములుమూలమునందు వలెనే అనువాదమునందును ప్రవేశించినవి. పద్యము నందు భాసుని పదయోజనమే ఎక్కువగా గోచరించుచున్నది, కాని అర్థస్ఫూర్తియందు మిక్కిలిక్లేశకారిగానున్నది. ఇంతకన్న యిచ్చట చేయదగినదిలేదు.

ఇంతవరకు తెలుగులోని సంస్కృత రూపకానువాదముల పరిశీలన సాగినది. దీనియందు సమర్థములైన యనువాదములు చాలకొలదియే. అయినప్పుడు వీనిని మరల యనువదించుట యవసరమా ? కాని వచ్చు అనువాదములు మాత్రము సమర్థముగా నుండునన్న నమ్మకమేమి ? ఈ అసంతృప్తి అప్పుడు మాత్రము కలుగదా ? అసంతృప్తి లేకుండ అనువాదమన్నది సాధ్యమే కాదేమో ? అయినప్పుడు ఈ అనువాదోద్యమము మరల కొన సాగించుట అనవసరము.

ఒకవేళ తెలుగులోనికి ఒక సంస్కృత రూపకమును అనువదింపవలెనన్నచో ఇదివరకనూదితము కాని దానిని చేయుటమంచిది. దానివలన భాషకు చాల ఉపయోగము కలుగును.

ఒకమాట ; ఈ లోపములన్నియు సంస్కృతము నేర్చి మూలము చూచినవానికిగదా గోచరించుట? కేవలము తెలుగు నేర్చినవాడు అనువాదములు చదివి ఏ కొంచెమో కాళిదాసాదుల నర్థము చేసికొన్నను అనువాదములయొక్క పరమార్థము సాధింపబడినట్లు మన మూహింపవలయును.

## అనుబంధము

### 1. భాసుడు

మధ్యమవ్యాయోగము 1

1. మానవల్లి రామకృష్ణకవి
2. వేటూరి ప్రభాకరశాస్త్రి 1913
3. చిలకమర్తి లక్ష్మీనరసింహం
4. యలమర్తి శ్రీనివాసరాయడు 1926-27
5. దీపాల పిచ్చయ్యశాస్త్రి 1957

స్వప్నవాసవదత్తము 2

1. చిలకమర్తి లక్ష్మీనరసింహం 1913
2. కాటూరి వేంకటేశ్వరరావు 1946
3. జంధ్యాల పాపయ్యశాస్త్రి
4. దివాకర్ల వేంకటావధాని 1941
5. మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి
   చిలుకూరి పాపయ్యశాస్త్రి
6. తిమ్మావఝ్ఝల కోదండరామయ్య 1955
7. ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి 1952
8. కంచనపల్లి జగన్నాధరావు (కొన్ని మార్పులతో)

ప్రతిమ 3

1. చిలకమర్తి లక్ష్మీనరసింహం
2. వేటూరి ప్రభాకరశాస్త్రి 1927
3. భ. మార్కండేయశర్మ 1934
4. పి. కోదండరామయ్య, సి. పిచ్చయ్య 1944
5. యడవల్లి ఆదినారాయణ 1954
6. మహమ్మద్ ఖాసింఖాన్ (పిల్లలకొరకు) 1954
7. భమిడిపాటి కామేశ్వరరావు 1955
8. ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి 1952

కర్ణభారము 4

1. వేటూరి ప్రభాకరశాస్త్రి 1918
2. మానవల్లి రామకృష్ణకవి 1918
3. కోపల్లె శివకామేశ్వరరావు 1921
4. దీపాల పిచ్చయ్యశా

అభిషేకము 5

1. చిలకమర్తి లక్ష్మీనరసింహం 1933
2. బులుసు వేంకటరమణయ్య
3. బులుసు వేంకటేశ్వరులు 1949

యజ్ఞఫలము 6

1. బులుసు వేంకటేశ్వరులు
2. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

ఊరుభంగము 7

1. మానవల్లి రామకృష్ణకవి
2. చిలకమర్తి లక్ష్మీనరసింహం
3. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి
4. వేదం వేంకటకృష్ణశర్మ 1952
5. దీపాల పిచ్చయ్యశాస్త్రి

దూతవాక్యము 8

1. మానవల్లి రామకృష్ణకవి
2. చిలకమర్తి లక్ష్మీనరసింహం
3. వేదుల సత్యనారాయణశాస్త్రి (వచనములో)
4. దీపాల పిచ్చయ్యశాస్త్రి 1958

---

ఈ అనుబంధములో కేవలము రూపకస్వరూపములో వచ్చిన పరివర్తనములే చేరినవి. వానిప్రక్క వాని ప్రచురణ సంవత్సరములు దొరికినంతమటుకు ఈయబడినవి. కావ్యాద్యేతర పరివర్తనములు చెప్పబడలేదు.

ఈ అనుబంధము తయారుచేయుటలో శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావు ఎం. ఏ గారు నాకు తమవద్ద నున్న సమాచారము నిచ్చి ఎంతయో తోడ్పడినారు. వారికి కృతజ్ఞుడను.

ఈ వ్యాసము ఉస్మానియా విశ్వవిద్యాలయము తెలుగుశాఖ నిరుడు నిర్వహించిన రూపక సమాలోచనమున 16-11-58 నాడు చదువబడినది.

**అవిమారకము 9**

1. మానవల్లి రామకృష్ణకవి
2. చిలకమర్తి లక్ష్మీనరసింహం

**ప్రతిజ్ఞా యౌగంధరాయణము 10**

1. చిలకమర్తి లక్ష్మీనరసింహం
2. కాటూరి వేంకటేశ్వరరావు 1954
3. పళ్లె పూర్ణప్రజ్ఞాచార్యులు 1947

**బాలచరితము 11**

1. మానవల్లి రామకృష్ణకవి 1946
2. చిలకమర్తి లక్ష్మీనరసింహం
3. కోరాడ రామకృష్ణయ్య 1919 (2)

**చారుదత్తము 12**

1. చిలకమర్తి లక్ష్మీనరసింహం
2. స్థానాపతి రుక్మిణమ్మ

**పంచరాత్రము 13**

1. చిలకమర్తి లక్ష్మీనరసింహం
2. గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి 1955
3. ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి
4. దీపాల పిచ్చయ్యశాస్త్రి 1957

**దూత ఘటోత్కచము 14**

1. చిలకమర్తి లక్ష్మీనరసింహం
2. స్థానాపతి రుక్మిణమ్మ
3. దీపాల పిచ్చయ్యశాస్త్రి

## 2. శూద్రకుడు

**మృచ్ఛకటికము 15**

1. వావిలాల వాసుదేవశాస్త్రి 1896
2. తిరుపతి వేంకటకవులు 1907
3. కొప్పరపు సుబ్బారావు (వసంతసేన అను పేర మార్పులతో)
4. భమిడిపాటి కామేశ్వరరావు
5. రావూరి వేంకటసుబ్బమ్మ

## 3. కాళిదాసు

**మాళవికాగ్నిమిత్రము 16**

1. కందుకూరి వీరేశలింగము 1885
2. వేదం వేంకటరాయశాస్త్రి 1919
3. దాసు శ్రీరాములు
4. వత్సవాయి వేంకటనీలాద్రిరాజు
5. ములుగు చంద్రమౌళిశాస్త్రి (మాళవిక అన్న పేర మార్పులతో)
6. మల్లంపల్లి శరభయ్య
7. ఎరసూరి మల్లికార్జునరావు

**విక్రమోర్వశీయము 17**

1. వడ్డాది సుబ్బారాయడు 1889
2. పి. సుబ్బారావు 1889
3. పురాణం సూర్యనారాయణశాస్త్రి 1907
4. వేదం వేంకటరాయశాస్త్రి 1921
5. ఆకొంట వేంకటసాంఖ్యాయనశర్మ
6. వత్సవాయి వేంకటనీలాద్రిరాజు
7. నండూరి రామకృష్ణమాచార్య 1954

**అభిజ్ఞాన శాకుంతలము 18**

1. పరవస్తు రంగాచార్యులు 1872-75
2. కందుకూరి వీరేశలింగం 1875-88
3. కోరాడ రామచంద్రశాస్త్రి (?)
4. రాయదుర్గం నరసయ్యశాస్త్రి 1894 మే.
5. వేదం వేంకటరాయశాస్త్రి 1896
6. వడ్డాదిసుబ్బారాయుడు 1906
7. గూడ కృష్ణయ్య 1912
8. దాసు శ్రీరాములు (అచ్చతెనుగు)
9. అంబటిపూడి రామబ్రహ్మం 1912
10. వి. కన్నయ్య 1915
11. కస్తూరి సుబ్బారావు 1916
12. మంత్రిప్రెగడ భుజంగరావు 1919
13. మోచర్ల రామకృష్ణయ్య
14. త్రిపురాన సూర్యప్రసాదరావు
15. గరిమెళ్ళ వేంకటనరసింహశాస్త్రి

16. సోమరాజు రామానుజరావు 1921-22
17. రాళ్ళభండి కోటమరాజు 1921-25
18. కాంచనపల్లి కనకాంబ 1929
19. కాకర్ల కొండలరావు 1930
20. వత్సవాయి వేంకటనీలాద్రిరాజు 1933
21. జె. గంగన్న 1931
22. ఎస్. రామకవి
23. భువనగిరి విజయరామయ్య
24. పేరి కాశీనాథశాస్త్రి
25. చిలుకూరి శ్రీరాములు 1946
26. ముళ్ళపూడి నారాయణశాస్త్రి 1954
27. పంగనామముల రామచంద్రరావు 1948
28. దుర్భా సుబ్రహ్మణ్యశర్మ
29. కేశిరాజు వేంకటనృసింహఅప్పారావు
30. మాదిరాజు విశ్వనాథరావు

(19 వ శతాబ్దమని మిక్కిలినేని రాధాకృష్ణగారు)

## 4. శ్రీహర్షుడు

**రత్నావళి 19**

1. వేదం వేంకటరాయశాస్త్రి 1921
2. కందుకూరి వీరేశలింగం
3. దాసు శ్రీరామకవి
4. కొమ్మనమంచి జోగయ్యశర్మ
5. మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి
   చిలుకూరి పాపయ్యశాస్త్రి
6. మానాప్రగడ శేషశాయి
   గ. శ్రీ. న. ఆచార్య 1956
7. టి. మల్లికార్జునరావు

**ప్రియదర్శిక 20**

1. వేదం వేంకటరాయశాస్త్రి 1910
2. బులుసు పాపయ్య 1903
3. చెన్నాప్రగడ భానుమూర్తి 1909
4. హనుమంతవఝ్ఝుల వీరరాఘవయ్య 1913
5. కొమ్మనమంచి జోగయ్యశర్మ 1950

**నాగానందము 21**

1. వేదం వేంకటరాయశాస్త్రి 1891
2. పాలెపు వేంకటసూర్యరాయప్రధాని
3. పాటిబండ మాధవశర్మ
4. వేటూరి ప్రభాకరశాస్త్రి
   డా॥దివాకర్ల వేంకటావధాని 1954
5. పంచాంగం నరసింహాచార్యులు

## 5. భవభూతి

**ఉత్తరరామచరిత్రము 22**

1. వావిలాల వాసుదేవశాస్త్రి 1881
2. దాసు శ్రీరాములు 1909
3. మల్లాది సూర్యనారాయణశాస్త్రి 1909
4. వేంకటరామకృష్ణకవులు 1913
5. ద్వివేది బ్రహ్మానందశాస్త్రి 1914
6. మంత్రిప్రెగడ భుజంగరావు 1918
7. నిడమర్తి జలదుర్గా ప్రసాదరావు 1919
8. వేదం వేంకటరాయశాస్త్రి 1920
9. బలిజేపల్లి లక్ష్మీకాంతం 1924
   (కొలది మార్పులతో)
10. జయంతి రామయ్యపంతులు 1931
11. కోరాడ రామచంద్రశాస్త్రి 1860-70
12. జనమంచి వేంకటరామయ్య
   (అసంపూర్ణము)
13. త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు
14. పంగులూరి రామచంద్రకవి
15. భువనగిరి కోదండపాణి
16. గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి
17. బులుసు సుబ్బారావు
   (రామరాజ్యమను పేర మార్పులతో)
18. రాయప్రోలు సుబ్బారావు

**మహావీర చరితము 23**

1. దాసు శ్రీరాములు 1902
2. మల్లాది సూర్యనారాయణశాస్త్రి 1

మాలతీమాధవము 24

1. మల్లాది సూర్యనారాయణశాస్త్రి 1896
2. దాసు శ్రీరాములు 1900
3. జనమంచి వేంకటరామయ్య 1902
4. పాడి వేంకటసూర్యనారాయణ (మూర్తి 1900
5. కంచనపల్లి జగన్నాథరావు (ఆరంకములుగా మార్చి వ్రాసెను.)

## 6. విశాఖదత్తుడు

ముద్రారాక్షసము 25

1. సుసర్ల అనంతరావు 1890
2. తిరుపతి వేంకటకవులు 1908
3. పాలెపు వేంకటసూర్యరాయప్రధాని 1932
4. కోరాడ రామచంద్రశాస్త్రి
5. అవధానం చంద్రశేఖరశర్మ
6. దాసు శ్రీరాములు
7. భమిడిపాటి కామేశ్వరావు (రాక్షసనిగ్రహణమనుపేర)

## 7. భట్టనారాయణుడు

వేణీసంహారము 26

1. వడ్డాది సుబ్బారాయుడు 1886
2. శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి 1907
3. కొడాలి సత్యనారాయణ 1926-27
4. కోరాడ రామచంద్రశాస్త్రి
5. బులుసు వేంకటేశ్వరులు 1951
6. తోలేటి వేంకటసుబ్బారావు

## 8. కృష్ణమిశ్రుడు

ప్రబోధ చంద్రోదయము 27

1. కందుకూరి వీరేశలింగం 1892
2. వడ్డాది సుబ్బారాయుడు 1898
3. ఆకొండి వ్యాసమూర్తి 1911

## 9. మురారి

అనర్ఘరాఘవము 28

1. ఆకొండి వ్యాసమూర్తి 1900
2. భువనగిరి విజయరామయ్య 1949
3. గడియారం వేంకటశేషశాస్త్రి (అసమగ్రము)
4. సత్యవోలు కామేశ్వరకవి

## 10. ఉద్దండనాథుడు

మల్లికామారుతము 29

1. వడ్డాది సుబ్బారాయుడు
2. గడియారం వేంకటశేషశాస్త్రి

## 11. రాజశేఖరుడు

బాలరామాయణము 30

1. తిరుపతి వేంకటవులు 1902

కర్పూరమంజరి (ప్రాకృతము) 31

1. చిలకమర్తి లక్ష్మీనరసింహం
2. రావూరి వేంకటసుబ్బమ్మ

విద్ధ సాలభంజిక 32

1. జనమంచి వెంకటరామయ్య

## 12. దిఙ్నాగుడు

కుందమాల 33

1. వడ్డాది సుబ్బారాయుడు 1932
2. బులుసు వేంకటేశ్వరులు Aug. 1947
3. ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రి
4. ఆకిలి శ్రీరామశర్మ
5. వేదం వేంకటకృష్ణశర్మ 1949
6. తల్లాప్రగడ సూర్యనారాయణమూర్తి ('శారద'లో)

## 13. భాస్కరుడు

ఉన్మత్తరాఘవము 34

1. కోరాడ రామచంద్రశాస్త్రి

2. ఆకిలి శ్రీరామశర్మ
3. తాడూరి లక్ష్మీనరసింహారావు 1899
4. జూలూరి హనుమంతరావు 1958
(పద్య నాటికగా 1958 Oct. నవభారతి)

## 14. జయదేవుడు

ప్రసన్న రాఘవము 35
1. మంత్రిప్రెగడ భుజంగరావు 1928
2. కొక్కొండ వేంకటరత్నం పంతులు 1897
3. సి. రామానుజదాసు 1881
4. చి. సుబ్రహ్మణ్యశర్మ 1958
5. కాకర్ల కొండలరావు

## 15. శక్తిభద్రుడు

ఆశ్చర్య చూడామణి 36
1. కుప్పాశ్రీ ఆంజనేయశాస్త్రి 1952
2. మల్లాది విశ్వనాథ కవిరాజు 1931

## 16. వారణాసి ధర్మసూరి

నరకాసుర విజయ వ్యాయోగము 37
1. కొక్కొండ వేంకటరత్నం పంతులు 1871

## 17. బిల్హణుడు

కర్ణసుందరి 38
1. విశ్వనాథరావు
కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

## 18. కాంచనాచార్యుడు

ధనంజయ విజయవ్యాయోగము 39
1. కొక్కొండ వేంకటరత్నం పంతులు 1894
2. పాలెపు వేంకట సూర్యరాయప్రధాని 1890

## 19. విజ్జిక

కౌముదీ మహోత్సవము 40
1. డా॥ దివాకర్ల వేంకటావధాని

## 20. రవివర్మ భూపాలుడు

ప్రద్యుమ్నాభ్యుదయము 41
1. కోటసుందరరామశాస్త్రి

## 21. పరవస్తు రంగాచార్యులు

మంజుల నైషధము 42
1. ఆకొండి వేంకటశాస్త్రి
2. నరసింహాచార్యులు (?)

## 22. రాజచూడామణి దీక్షితుడు

కమలినీ కలహంసము 43
1. పరవస్తు రంగాచార్యులు
2. పాలెపు వేంకట సూర్యరాయ ప్రధాని 1889
3. పులుగుర్త నరసింహామాత్యుడు

## 23. సింగభూపాలుడు

రత్నపాంచాలిక 44
1. మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి
2. గిడుగు సీతాపతి
(కువలయావళి పేర)

## 24. సుభటుడు

దూతాంగదము 45
1. చర్ల నారాయణశాస్త్రి
2. పాలావజ్ఝల రామశాస్త్రి ఎం. ఏ.
(నవభారతి - జూన్ 1959)

## 25. బోధాయనులు

భగవదజ్జుకము 46
1. వేటూరి ప్రభాకరశాస్త్రి 1924

## 26. మహేంద్రవర్మ

మత్తవిలాసము 47
1. వేటూరి ప్రభాకరశాస్త్రి
2. విద్వాన్ విశ్వం

## 27. రామభద్ర దీక్షితుడు

**జానకీపరిణయము** 48

1. దాసు శ్రీరాములు
2. పాలెపు వేంకట సూర్యరాయ ప్రధాని 1891

## 28. కాళిదాసు (పేరు)

**లంబోదర ప్రహసనము** 49

1. హాస్య కళానిధి (కూచి నరసింహంగారని వినికి)

## 29. విద్యానాథుడు

**ప్రతాపరుద్ర రాజ్యాభిషేకము** 50

1. చెలమచెర్ల రంగాచార్యులు

## 30. అగస్త్యుడు

**బాలభారతము** 51

1. కొత్తపల్లి సూర్యారావు

## 31. వేంకటనాథుడు

**సంకల్ప సూర్యోదయము** 52

1. తిరుక్కోవలూరి ఆదివరాహాచార్యులు 1926

## 32. హరిహరుడు

**భర్తృహరి నిర్వేదము** 53

1. అనుముల సుబ్రహ్మణ్యశాస్త్రి

## 33. రామచంద్రుడు

**సత్యహరిశ్చంద్ర** 54

1. దివాకర్ల వేంకటావధాని

## 34. క్షేమేశ్వరుడు

**చండకౌశికము** 55

వడ్డాది సుబ్బారాయుడు

## 35. అభినవ భట్టబాణకవి

**పార్వతీపరిణయము** 56

1. చిలకమర్తి లక్ష్మీనరసింహము

ఒకాయన వాదించుట మొదలు పెట్టినాడు. 'విద్య యొసగును వినయంబు' అన్నమాట భర్తృహరి యన్నాడని. వాదనకాధారము భర్తృహరి మూడు శతకములలో ఏయొక్కటియు కాదు. 19-8-59 నాటి ఆంధ్ర సచిత్రవారపత్రిక.

ఇది అంధదేశము. రచయిత లంధులు. అందుచేత దీనికి పేరు సార్ధకము.

చిన్న కథలన్న పేరేగాని నిజముగా చిన్నదైన కథ ప్రకటింపబడిన కథలలో ఒక్కటియు కనబడుట లేదు. ఏ సంఘటన ప్రధానమైనదో దానికి దీప్తి వచ్చునట్లుగా కథ వ్రాయవలయును. తెలుగు కథకుడు ఆ ప్రధాన ఘట్టమునకు వందమైళ్ళ వెనుకనుండి కథ మొదలు పెట్టుకొని వచ్చును. పర్యవసానము కథాదైర్ఘ్యము. పాఠకుల విసుగు. కొంత గీకినగాని అసలు విషయ మందుకొనలేనివారు మన కథకులు. అపవాదములు లేక పోలేదు.

ఆద్యంతములకు చక్కని సమన్వయము గల కథ మంజుశ్రీ వ్రాసిన 'ఆ మె కు తె లి య ని ర హ స్య ం' (జయంతి 11). ఇంగ్లీషు శబ్దముల వ్యామోహము మాత్రము రచయితకు వదలినట్లు లేదు. "లైఫ్‌లో ఎలా ప్రాస్పరవుతావోయీ" వంటివి ఘోరములు. ఇవేకాదు మెలోడ్రమెటిక్ ఎఫెక్టు. (పుస్తక సమీక్ష) మొదలగు శబ్దములు జయంతి సంపాదకులు ఏ ప్రయోజనము నాశించి ప్రకటించుచున్నారో తెలియదు. ఈ తెలుగుపత్రికా సంపాదకులకు, రచయితలకు ఉన్న ఇంగ్లీషు వ్యామోహమునుగూర్చి చెప్పవలెనన్నచో దానికి సాహిత్యధార చాలునట్లు లేదు. ప్రత్యేక శీర్షిక కావలయును.

రచయితలు శబ్దదోషములు వ్రాసి విబుధులకు విచారము కలిగించుచున్నారని కౌశిక జ య ం తి చర్చావేదికలో బధిరశంఖారావము చేసినారు. వాపోవుట వారిపని, వ్రాయుట మాపనిగా నున్నది. అజ్ఞానమునకు అహంకారమునకు రాజకీయిలది పెట్టినది పేరుగనుక వారిసంగతి వదలివేయవచ్చును. సాహిత్య పత్రికల మాటయేమిటి? 'ప్రాముఖ్యత' 'శక్తివంతము' ఇటువంటిమాటలు సాహిత్య పత్రికల సంపాదకీయములో (స్రవంతి. సెప్టెంబరు) వ్రాయబడుట ఘోరము.

సంపత్కుమార 'వాంఛానుమితి'లో (భారతి) అనుమానము చేతనే అర్థము చేసికొనవలసిన లక్షణము కొంత యున్నది. ఈ కవి అప్రతిభుడు కాడు. అభావుకుడు కాడు. ఇతనికి ఎత్తుగడలు తెలియును. పద్యమును కవ్విచ్చులో పెట్టి తీగ లాగినట్లు వ్రాయుట తెలియును. కొన్ని అతిలోకములైన కల్పనలు చేయుట తెలియును. పలుకులో చేవయున్నది. హృదయములో వేదనయున్నది. ఇన్ని యుండియు ఒక ముఖ్యమైన గుణము ఇతనిలో లోపించినది. భావము స్పష్టపడునట్లుగా వ్రాయజాలకపోవుట. ఏదో తరుముకొని వచ్చినట్లు పైకి కనిపించిన ప్రౌఢి విడదీసి చూచినంతనే యదృశ్యమైపోవుచున్నది. వర్ణనాప్రధానముగా వ్రాసినంతవరకు ఇతనిలో ఈ దోష మున్నదని చెప్పుటకు వీలులేదు. ఎక్కడ తన యనుభూతిని చెప్పుటకు ఈ కవి ప్రారంభించునో యచ్చట ఈ దోషము తలయెత్తును.

ఆర్తిమయముగా బయలుదేరిన కృతి శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తిగారి రాజరాజేశ్వర పద్యములు (జయంతి 11). ఈ కవి తెలుగు పలుకుబడి పసందెరింగినవాడు. ఈ పసందు విశ్వనాథ సత్యనారాయణ గారికి తెలియును. కాటూరి వెంకటేశ్వరరావుగారికి తెలియును. ఈ కవికి తెలియును.

స్వప్నే ప్రతీయమానాని (తుమ్మలపల్లి రామలింగేశ్వర రావు. జయంతి 11) లో భావము సాగతీయబడినది. మరి కొంత తగ్గించి చెప్పినచో భావమునకు మరింత యందము వచ్చెడిది. పద్యరచనలో మాధుర్యమున్నది. ప్రౌఢియున్నది.

రమ్యమైన పద్యరచన గల మరొక శీర్షిక అక్షరశిలలు (బులుసు జీ. ప్రకాష్. జయంతి 11).

జయంతివారు నాయందు కొంతదయ చూపింపవలయును. గడచినసారి నా పేరే మ్రింగినారు. 'ఉచ్చారణ తప్పు' అని నేనొక శబ్దమునకు వ్రాయగా దాని నింకొక శబ్దమునకు తగిలించినారు. ఇంతకు ఏ శబ్దము తప్పు అని వ్రాసినానో అది రేనేలేదు.

ప్రసిద్ధి నార్జించవలయునన్న ఇచ్ఛయుండవలయునుగాని, దానికి తగిన కృతకృత్యము మనస్సులో నుండవలయునుగాని,దాని ననేకవిధములుగా నార్జించవచ్చును.కొన్నియేండ్లకు పూర్వ మొకాయన పేరు. పిచ్చివ్రాతకు ప్రతీకయైనది. ఆయవ మెరుగు. ఒకవ్యాకరణమునోదేవినోయాశ్రయించినాడు.దేనిని ఆశ్రయించక అచ్చముగా తన మేధనే యాశ్రయించిన ఒక దురానంద్ స్రవంతిలో రామాయణ కల్పవృక్షముపై ఒక విమర్శ వ్రాసినారు. ఎవరో అన్నారట ఇది అద్వైత రామాయణమని. కవికి అద్వైతము తెలియనే తెలియదని ఈయన వాదన. "తనయుడన్న సూక్ష్మతత్త్వం బెఱుంగనిజీవి మాయలోన జిక్కుకొన్న యనదవుర్వ" కవియొక్క అజ్ఞానమును నిరూపించుటకు విమర్శకుడీ పద్య ముదహరించినాడు. ఉదహరించి తార్కిక శంకలు లేవదీసి వేదాంతచర్చచేసి "పుత్ర వర్జితుడు మాయలో చిక్కుకపోకాడని ఈయన వితండ వాదన" అని తేల్చినారు. అయ్యో! అడవిగోల. ఈపద్యములో నున్నది రూపకాలంకారమని తెలియక ఎంత శ్రమ

కావచ్చును. కానిచో మా భాషలోః ౩ పుల మంచిచెడ్డలను పదినారు విమర్శకులు. 'ఆత్మజాతన్న తీయదనంబు' 'ప్రియ సుతుడన్న జాబిల్లి' 'కొడుకన్న చిన్నారిపడవ' 'కొమరుడన్ పుణ్యకర్మము' 'తనయుడన్న సూక్ష్మతత్త్వంబు'. కొడుకునకు తీయదనముతో, జాబిల్లి అనగా చంద్రునితో, చిన్నారి పడవతో, పుణ్య కర్మముతో, సూక్ష్మ తత్త్వముతో పోలిక. కొడుకు వానివంటివాడు. అవేవియుకాదు. ఈమాటలన్నది అద్వైతికాదు. దశరథుడు. ఆ దశరథుడెటువంటివాడు? చిరకాలము పుత్రులు కలుగక దిగులుపడుచు 'తన మనో వాంఛలెల్ల సంతానమయమై'నవాడు. ఆయనకు పుత్త్రోత్పత్తి కనబడుటలో యాశ్చర్యములేదు సరికదా యది సహజముగా లోకసామాన్యముగా నున్నది. ఏది యెక్కడ వెదుక వలయునో తెలియవలయును. ఒకాయన వీథిలో దీపపు కంబముక్రింద దేనినో వెదకుచున్నాడట. ఏమయ్యా వెదకు చున్నావనగా 'పొలములో నా యుంగరము జారిపోయినది. అక్కడ వెదుకుదమనగా వెలుగులేదు. ఇక్కడ వెలుతు రున్నది కాబట్టి వెదకుచున్నాను' అన్నాడట. వస్తువును లేనిచోట వెదకి ఇచ్చట లేదేమని గర్జించినవాడు వైతండి కుడుకాని అది యెట్లుండవలయునో యట్లు వ్రాసినవాడుకాదు. 'ప్రాణ విత్త మానభంగమందు బొంకవచ్చు నఘముపొంద దధిప' అన్న పద్యము చదివి ఒకాయన 'పోతన్న యెంత దురా[illegible]డు! పైగా పలికించెడువాడు రామ భద్రుండట అనికూడ వ్రాసికొన్నాడు.' అని ముక్కుమీద వేలు వేసి కొన్నాడట. ఈ విమర్శకూడ ఇట్లే యున్నది. ఆ విమర్శ యట్లుంచి కొన్నిసామాన్య విషయములందు ఈవిమర్శకునికి గల యజ్ఞానము ఆశ్చర్యాపాదిగా నున్నది. ఈయనకు ఆధి దైవిక ఆధిభౌతికాది సామాన్య పదముల అర్థము తెలిసినట్లు ఆ పదములు ఈయన వాడిన పద్ధతినిబట్టి గోచరించుటలేదు. *అధిదైవికంగా* రామాయణం రూపొంది ఐహిక ప్రసారాన్ని శాసించే స్మృతిగా నిలిచింది.' *అధిభౌతికంగా* దేశంక్షీణదశలో ఉన్న ఆ మధ్యయుగంలో....' ఇక జీవునికి ఈయన చెప్పిన నిర్వచనము ఆవిషయముపట్ల ఈయనకున్న జ్ఞానమును వేనోళ్ళ చాటుచున్నది. "మానవునిలోని మానవశక్తులు క్షీణించినప్పుడు మానవుడు జీవుడౌతాడు." మరి పశువెప్పు డగునో, జీవుడనగా నేమో తెలియదు. ఆధిభౌతికాధిదైవి కాది శబ్దముల కర్థము తెలియదు. ఏమాట నే యర్థమునకు ప్రతీకగా నైకొనవలెనో తెలియదు. కవివాక్యమేదో కథా గతమైన యొక పాత్రవాక్యమేదో తెలియదు. వీరు విమర్శకు దిగినారు. సంపాదకులు ప్రచురించుట కొడిగట్టి నారు. వ్రాయవద్దనుటలేదు. ప్రచురింపవద్దనుటలేదు. ప్రాథ మిక విషయములందుకూడ అజ్ఞానము వెలిబుచ్చు రచనల నేబుద్ధితో ప్రచురించుచున్నారని. అంతే. అభిప్రాయ భేద ములువేరు. విశ్వనాథ సత్యనారాయణగారు కవికాదని వాదించువారుండవచ్చును. వారి వాదనకు పత్రికలలో స్థానముకూడ నుండవలయును. కాని ఆయన వ్రాసిన రూపకాలంకారముకూడ గ్రహింపలేనివారు, ఉపమలేని చోట నున్నదనువారు, ఇటువంటివారి రచనలకు కూడ పత్రికలలో స్థానముండవలయునా యని ప్రశ్న. ఏమో! ఏయేరచన లెందుచేత ప్రకటింపబడునో యెవరెరుంగుదురు? 'దొడ్డిబెట్టిన వేల్పు గిడ్డికాపు' మానవుడు కామధేనువని అనగా పశువని పెద్దన వితండవాదము చేయుచున్నాడని నిమర్శించినచో స్రవంతి సంపాదకులు ప్రచురింతురా? ప్రచురింపరని యేమి నమ్మకము?

ఈ విమర్శకున కేదో క్రొత్తగా వ్రాయవలయునని సంకల్పము. కాని దానికికూడ తెలివి యవసరమాయెను. అందుచేత ఇది వట్టి 'ఘటంభింద్యాత్'విమర్శగా తయారైనది. విమర్శ యెట్లున్నప్పటికి దక్షిణ భారత హిందీ ప్రచార సభవారు ఈవిమర్శ ప్రకటించుట బాగుగా లేదు. ఈ స్రవంతి ఆ సంస్థవారిచేత నడుపబడుచున్న పత్రిక. ఒక యభ్యుదయ ఈ వ్యాసమును ప్రకటించుటలో యర్థ మున్నది. ఒక జయంతి గురజాడ అప్పారావుగారు కవి కాదనుటలో యర్థ మున్నది. ఈ ప్రచారములు వారివారి కవితా సిద్ధాంతముల కనుగుణముగా నున్నవి. దక్షిణ దేశ ములో హిందీ ప్రచారము చేయుటకు పూనుకొన్నవారికి వాదోపవాదముల ప్రసక్తి యెందుకు? అట్టలపైనున్న బొమ్మ లలో తప్ప, అప్పుడప్పుడు ప్రకటింపబడుచున్న నివేదికలలో తప్ప, ఈ పత్రికలో హిందీ ప్రచారము లేదు. ఇదివరకు సత్యనారాయణగారు హిమాలయము-ఆయన శివైకదేశము అని ఆయన అభిమానులు పనిపెట్టుకొని వ్రాసిన వ్యాసములు వీరు పనిపెట్టుకొని ప్రకటించుట జరిగినది. ఇప్పు డాయన కవికాదన్న వ్యాసములు పనిపెట్టుకొని ప్రకటించుట జరుగు చున్నది. మరి యా విమర్శలు హిందూమతమును దూషించు నంత దూరము పోవుచున్నవి. ఆంగ్లేయులు దేశభాషాకవులు కవులుగా దీపింపకుండునట్టి యొక విమర్శ పద్ధతి ఈ దేశ ములో ప్రవేశ పెట్టిరి. అట్లే హిందీ ప్రియులు, తత్ప్రచార కులు మరొక పద్ధతిని ప్రవేశపెట్టు ప్రయత్నము చేయు చున్నారా? దానికేమి? తెలుగు దేశములోని సమర్థులయిన కవులను మొదట కాదని తరువాత ఏ హిందీ కవినో తెలుగు దేశము నెత్తిమీద యెత్తుటకూడ ప్రచారములోని ఒక భాగము

తెలిసికొను పని మాది. పరభాషా ప్రచారకులు మాకా విష యములు చెప్ప నక్కఱలేదు.

దక్షిణ భారతములో హిందీ ప్రచారము నేడు మిక్కిలి కఠిన కార్యమని చెప్పకుండ తెలిసికొనవలసిన విషయము. తమిళదేశములో ఒక వింధ్య పర్వతము ఇదివరకే దాని కడ్డముగా నిలబడినది. అదృష్టవశమున తెలుగుదేశములో అబాధలేదు. ఆ లోపమును హిందీ ప్రచారకులు దూరము చేయుదురేమో చూడ వలయును.

—సమవర్తి

చర్చావేదిక :

## సాహిత్యధార - ఒక అభిప్రాయము

"జయంతి" పత్రిక అనతి కాలములోనే తెనుగునాట నాటుకొని పోయినది. వ్యాసములు, అనువాదములు, గేయ ములు, కవితలు, చర్చలు, కథలాదిగా వివిధ శీర్షికలు గల్గిన 'జయంతి' పత్రిక చదువుట షడ్రసోపేతమయిన భోజనము నారగించుటయే.

కాని, పరిపూర్ణత్వము ఎల్లప్పుడును మానవాతీతమేయను కఠిన సత్యమును నిరూపించుటకో యన్నటుల 'సాహిత్య ధార' శీర్షిక క్రింది విమర్శలు కొన్ని 'జయంతి' మధుర గానమునం దపశ్రుతుల బోలియున్నవి. ఆశీర్షిక క్రింది కొన్ని వ్రాతలలో సాటి వ్యక్తులను, సాటి పత్రికలను విమర్శయన్న పేరుతో దూషించుచుండుట నిష్పాక్షిక దయినవాడెవ్వడును సహింపజాలనిది. రచయిత కలము స్వతంత్రమయినదే; కాని ఏ స్వాతంత్ర్యమున కయినను హద్దు కలదుకదా. ఆ హద్దు నతిక్రమించుట 'సహసా విదధీతనక్రియాం' అన్న ఆర్యోక్తిని గుర్తుకు తేకమానదు. ప్రగతికి విమర్శ అవసరమే. వ్యక్తి కానిండు, సంఘము కానిండు, కళకానిండు, కథారచన కానిండు విమర్శ— సహృదయముతో, సభ్యతా పరిధుల దాటక, నిర్మాణాత్మక ముగ నున్న విమర్శ— వాంఛనీయమే. రాముడు సోముని ముఖమున కళ్ళాపి జల్లుట, సోముడు రాముని నెత్తిమీద రాళ్ళు గ్రుమ్మరించుట—విమర్శ అనుపించుకొనజాలదు.

జయంతి 10 లో 63 వ పుటయందును, జయంతి 11 లో 8 వ పుటయందును ఇతర పత్రికల యందలి రచనలలో వాడబడిన ఆంగ్లపదముల పట్టిక ఇవ్వబడినది. జయంతి 11 లో 8 వ పుటయందు, 'సాహిత్యధారా' నిర్వాహకులు 'క్విక్సాటులు'గా ఆంగ్లపదములు వాడువారిని, వారికి తగిన 'సాంకోపాంజా'లుగాను "సంపాదకులు'గాను అరచనలున్న పత్రికా సంపాదకులను వర్ణించినారు. ఆ విమర్శకుల కలము నుండి ఇటువంటి దూషణలు 'విమర్శ' పేరిట వచ్చుట వారి ప్రత్యేక సంస్కార సూచకమో, సంపాదకమండలి ఉపేక్షా ఫలితమో, 'జయంతి' ప్రియుల దురదృష్టమో తెలియ కున్నది. అంతియేకాదు. ఆంగ్ల పదముల వాడకమును నిరసించు అచ్చతెన్గుల ఉత్ప్రేక్షలకు ఒకానొక ఆంగ్ల నవల లోని పాత్రలే రావలసివచ్చుట హాస్యదాయకమా లేక శోచనీయమా ?

గురివెంద గింజ తన నలుపు నెరుగదని సామెత. దీనిని రుజువుపరచిన సాహిత్యధార నిర్వాహకు లభివందనీయులు లేనిచో—ఇతర పత్రిక లొకటి రెండింటిలో నాంగ్లపదములు వాడబడినవని పుటలనిండ మొసలి కన్నీరు కోట్లు కోట కార్చిన పెద్దలకు—ఉత్తమ మనిపించుకొనని రీతిలో సాగిన తమ విమర్శల కిటునటు *తమ పత్రికలలోనే దొరలిన ఆంగ్లభాషా పదములు కనబడలేదా ? ఈ విషయమున వారి తెనుగుదన మేమయినది? లేక—తనకొక తక్కెడ, ఎదుటి వానికి మరొకటియా ?

జయతి 10 వ, 11 వ సంచికలలో నగపడిన ఆంగ్ల పద ముల నవధరింపుడు.

జయింతి 10 :

32 పుట - "డ్రాయింగురూం."

33 పుట - "టీ, సాసరులో" నీటి "బకెట్" "ట్రంకులు."

41 పుట - "షర్టు" హిందీ "టీచరు" "ట్యూషన్లు."

42 పుట - "స్కూలుఫైనలు" "కంపెనీ ఏజెంటు" "ఫస్టు ఎయిడ్ బాక్సు."

43 పుట - "ఆఫీసుటైం" "ఎలక్ట్రిక్ స్తంభం" "లైటు."

44 పుట - "మిషన్" "హాస్పిటల్."

45 పుట - "జీపు" "డ్రైవరు, హారన్."

* జయంతి సమవర్తి పత్రికకాదు. జయంతికి సౌజన్య, సమవర్తి, ఇరువురును సమానులే. సం. జ.

ఈ సంచికలోనే 84 వ పుటయందు చిట్టచివర 'సమవర్తి' గా ఉదహరించిన గేయ పంక్తులలో ఆంగ్ల పదములు ("ప్రైవేటు" "పబ్లిక్కు") ఉన్నను ఆ గేయ రచయిత "క్విక్సాటు" కాలేదు;"సమవర్తి" "సాంకోపాంజా" కాలేదు; జయంతి సంపాదకులు సంఘాతకులు' కాలేదు. ఎందుచేత? ....'సమవర్తి'గారి శంఖములోనిదే తీర్థమగుటచేతనా? "క్విక్సాటులు" కాని వారు రచించిన, ఆంగ్లభాషా రహితము లయిన ఇతర పంక్తులు ఉదహరించుటకు లేకపోవుట 'సమవర్తి'గారి పఠనావైశాల్యమునకు తార్కాణమా? లేక తెనుగుభాషా విస్తీర్ణత కుదాహరణమా?

మరి కొన్నింటిని చిత్తగింపుడు.

జయంతి 11:

3-పుట "టైఫాయిడు" గీతం

21-పుట "మెంటల్ డాక్టర్" "స్కూలు అసిస్టెంటు" "హెడ్మాష్టరు రిటైరై" "సీనియర్" "ఫాషన్".

22-పుట "మెలొడ్రమెటిక్" "పిస్టల్" "క్లైమాక్సు" "విట్" "ఎఫెక్టు"

29-పుట "డాష్" "అటెండెన్సు" "లెక్చరర్" "ప్రజెంటు మార్కు" "లైఫ్‌లో" ఎలా "ప్రాస్పరవుతావోయ్" "స్కాలర్ షిప్"

30-పుట "బుకింగ్ క్లర్కు" "కౌంటర్" "ఫస్టున ప్యాసైనట్లు" "ఫస్టు క్లాసు"లో

32-పుట "కాలేజీ టైం" "పొయిట్రీ క్లాసు"

45-పుట "స్టూల్"

48-పుట "మెటల్ వర్క్సు" "ఫోర్‌మెన్"

55-పుట "సిల్కు"

ఇక్కడకు దాదాపు యాభై పదములయినవి—అనగా సగటున సంచికకు పాతిక చొప్పుననన్నమాట. వీటిని గురించి 'సమవర్తి' ఏమందురు?

అటులకాదు; "సాహిత్యధార" నిర్వాహకులు పరమోత్తమమయిన ఉద్దేశముతో, ఆంధ్రమును అన్యభాషా పదరహితముగ నొనరించి, అచ్చ తెనుగును తీర్చిదిద్ది వాగనుశాసనత్వము చేయ కంకణము ధరించినారే అనుకొందము. అయినచో, ఆంగ్లపదజాల ముపయోగించిన ఒకటి రెండు పత్రికలను విమర్శించినవారికి, ఆ శీర్షికలోనే అన్యత్ర పేర్కొనబడిన మరియొక పత్రిక (దానిని 'క' యనివ్యవహరింతము) లో వాడబడిన—"స్వీపర్" "వాచ్ మేన్" "ఎగ్జిబిషన్" "ఎంటర్‌టైన్ మెంట్సు" "రిజిష్టర్" "కాంపౌండు యార్డు" "అప్పాయింట్ మెంట్ ఆర్డర్" "డ్యూటీ" "సర్వీసు" "రిటైర్" "ట్రాన్స్‌ఫర్ ఆర్డర్"— మున్నగు పదములు కనపడకుండుట విచిత్రముగాలేదా? లేక వారి దృష్టిలో ఇవి ఆంగ్లపదములు గావా?

'జయంతి' లోను 'క' లోను వాడబడినవియు, పైన ఉదహరింపబడినవియు నయిన ఆంగ్లపదములను పురస్కరించుకుని, జయంతి 11 లోని 8 వ పుటయందు విమర్శకు డడిగిన ప్రశ్నల నిట పొందుపరచుచున్నవాడను.

"ఇందులో, తెలుగుభాషలో జీర్ణించుకొనిపోయి నిత్య వ్యవహారములో చేరినవెన్ని? అక్కడ ఆ ఇంగ్లీషు శబ్దము వాడుటతప్ప గత్యంతరములేని స్థానము లెన్ని? ఆయా రచయితలు సెలవిచ్చెదరా? సంపాదక మహాశయులు విశదీకరింతురా? (—— ఈ పదము క్రింది గీత నాది)- ఈ ప్రశ్నలను 'జయంతి'లోనుండి నే నెత్తిచూపిన ఆంగ్ల పదముల కన్వయించుకుని విమర్శకులు సమాధానము లిత్తురుగాక!

ఈ విషయమునుండి దృష్టిని కొంత మరల్తము.

మరియొకచోట ఈ శీర్షికయందే - "కొందరు ప్రసిద్ధులతో తప్పని సరిగా వ్యాసములు వ్రాయించుట - వారు పనిగా పెట్టుకొనినట్లున్నారు." అని విసరినారు విమర్శకులు. ఒక పత్రికలోనివారు 'ప్రసిద్ధులతో తప్పనిసరిగా వ్యాసములు వ్రాయించుట' మరియొక పత్రికలోని వారు వ్రేలెత్తి చూపదగినంతటి దోషమా ఏమి? పత్రికా రచనయం దీక్రొత్త సంప్రదాయ మెపుడు ప్రవేశించినదో విమర్శకులు తెలిపిన నాబోటి సామాన్యులు లాభమందగలరు. ఇది దోషమే అయినచో 'జయంతి' ఆ దోషము నాచరించుట లేదా ఆంగ్లభాషా పదముల ననుమతించిన "పాతకము" (?) వ కొడిగట్టిన తదితర పత్రికలను వదలివైచి ఒకటి రెండు పత్రికలను మాత్రమే దెప్పిపొడుచుటయు, "ప్రసిద్ధులచే వ్యాసములు వ్రాయించుచున్నా"రన్న మొండి బాణమును, మరల ఆ రెండు పత్రికలలో నొక దానిమీదనే ప్రయోగించుటయు గమనించిన యెడల 'సాహిత్యాధారా' శీర్షిక నిర్వాహకుల కా పత్రికపై ఇంతటి అవ్యాజానురాగ మేల? అనిపింపక మానదు....

సభ్యత పరిహద్దుల నతిక్రమించిన వ్యంగ్యమును, విజ్ఞత కన్న అహంభావము నెక్కువ ప్రతిబింబించు విమర్శను - సహించుట భాషపట్ల అశ్రద్ధమాత్రమే కాదు, అగౌరవమును కూడ ప్రదర్శించుట యగును. ఇటువంటి విమర్శలకు తావిచ్చుట 'జయంతి' యశస్సునకు దోహదకారి కాజాలదు.

ఆంగ్ల పదములు కొన్ని తెనుగు భాషలో జీర్ణించుకొని పోయి, నిత్యవ్యవహారములో చేరినట్లు మాత్రము ఒప్పుకొనక తప్పలేదు—విమర్శకులకు.

అది యటులుండ, జీర్ణించుకొనిపోయిన ఆంగ్లపదములు ఏవేవి అవి ఎపుడెపుడు, ఎట్టి సందర్భములలో జీర్ణించుకొని పోయినవి? ఆ ఆంగ్లపదము లన్నియు తెనుగు భాషలోనికి రానర్హములని నిర్ణయించిన 'సమవర్తి' 'వాల్మీకు' లెవ్వరు? కొన్ని ఆంగ్లపదములకు గత్యంతరము లేదని ఈ విమర్శకు దన్నయెడల, మరికొన్ని ఆంగ్లపదములు తెనుగులోనికి తప్పక దిగుమతి కావలయునని మరియొక విమర్శకు డన వచ్చును. ఆయన పీయన కాదనగలరా?

భాష లక్ష్యము భావప్రసారము. భాషచైతన్యవంతము; పరిణామము దాని లక్షణము. ఈనాటి శిష్టాంధ్రమునకు చిన్నయసూరి వాడిన దానికిని గల వ్యత్యాసము సులభ గ్రాహ్యము. భాష 'జయంతి' పత్రికలో సాహిత్యధార యడు గున బుట్టలేదు; సమవర్తి నాధారముగా గైకొని పెరుగ లేదు; పెరుగబోదు. భాష ప్రజలమీద నాధారపడినది. ప్రజలు, వారి జీవితము, వారి అలవాట్లు—వానిమీద ప్రస రించు రాజకీయ ఆర్థికాది ప్రభావముల ననుసరించి యుండును. ఆంగ్లేయులు వందయు నేబది యేడులు మన దేశమును పాలించిపోయిరి. వారి జీవన విధానము, వారి విజ్ఞానము, వారి సాంఘిక సంప్రదాయము—కొంతకు కొంత మనలో నాటుకొనిపోయినవి. తత్ఫలితముగా నాంగ్లపదములు కొన్ని మన భాషలోనికి మాత్రమే కాదు; తదితర భారతీయ భాష లన్నింటిలోకిని వచ్చినవి. వినునప్పుడు గాని, పలుకునపుడు గాని అవి ఆంగ్లపదము లనిపించనంతగా అవి ఆ యా భాష లలో నిమిడిపోయినవి. ఒక ఆంగ్లపదములు మాత్రమే నేమి, హిందీవంటి ఇతర భారతీయభాషా పదములు గూడ ఆంధ్రములో కొల్లలగుపించును. ఇక ఆ యాంగ్లమునే పరిశీ లించినను, అందు 'లాటిన్' వంటి ప్రాచీన ఐరోపీయ భాషా పదములనుండి నేటి మన 'హిందూస్తానీ' పదములవరకు అన్యభాషా పదములు మెండుగా నగపడును.

ఇందువలన తేలున దేమి యన—భాషకు సరిహద్దులు గీయబూనుట విజ్ఞులొడిగట్టని సాహసము. భాష నే 'చక్ర వర్తి'యు గుత్తకు తీసుకొని యుండలేదు. భాషకు సమ్రా ట్టులు దానిని వాడు ప్రజలు; భాష రూపురేఖల దిద్దు సృష్టి కర్తలు నా ప్రజలే. ఏరచయితయినను ప్రజలను, వారి భాషను-మరచి వ్రాయడు. అది ఒక మెచ్చదగిన సాహిత్య ప్రక్రియకాదనుడు, దానిని జదువులోక ఉత్తమమైన అభిరుచి కాదనుడు, ఇంకను లక్షయనుడు—నేటి తెనుగు సాహిత్య ములో కథకున్నంత ప్రచారము, ప్రజాదరణము మరొక దానికిలేదు. కాన ప్రజాబాహుళ్యపు భాష కథారచయితమీద ప్రసరించుట సహజము. కథను వ్రాయువాడు దానిని జదువు ప్రజలలో నెక్కువమంది మాటలాడు భాషను వ్రాయబూనుట సహజము మాత్రమేకాదు, అవసరముకూడ. మాటలాడు భాష యొకతీరుననుండ మరొక తీరున కథ వ్రాయబూనుట కృత్రిమత్వము నారాధించుటయే యగును. మడిగట్టుక కూరుచుని ఒక పెద్ద కర్రతో అన్యభాషా పదములను తరిమివైచుచు వ్రాయ మొదలిడినచో కథకుడు కథను వ్రాయలేడు; వ్రాసినను చదువువారు తండోప తండములుగ నుండరు. ఈ విషయము 'జయంతి' వారికి తెలియనిదికాదు. లేకపోయిన యెడల ఒకచో 'సాహిత్యధార'ను ప్రవహింపజేయుచు నింకొకచో ఆంగ్ల భాషాధార నెటుల ననుమతించిరి?

ఇంకొకమాట, మనభాష సంస్కృతమునుండి వచ్చినది. నేటికిని సామాన్యులకు నిఘంటువు లేనిదే అర్థముగాని సంస్కృత పదములు మన భాషయందు దొరలుచునే యున్నయవి. అటువంటి యప్పుడు ఆంగ్లపదములుకూడ స్వేచ్ఛగా మన భాషలో నిమిడిపోవుటకుగల యభ్యంతర మేమి? ఆంగ్లభాష విదేశీయభాష యనియా? ప్రజాసామా న్యము కర్థముగానిచో సంస్కృతమును విదేశీయ భాషా సమానమేకద! పండిత ప్రకాండులు సంస్కృత సమా సాలంకారాది విశేష ప్రయోగ భూయిష్ఠమైన భాషను వాడు చున్నపుడు ప్రజలు సులభముగ గ్రహించగల ఆంగ్లపదము లున్న భాష ఏల గర్హనీయమో అనూహ్యముగా నున్నది. సంస్కృతము దేవభాష; ఆంగ్లము అంతర్జాతీయభాష.

అసలు మనదేశభాష లన్నిటను తెనుగుభాషవలె ఇతర భాషా పదముల నిముడ్చుకొన గలిగిన భాష మరియొకటి లేదనియు, ఆకారణమున తెనుగు భారతదేశపు రాజభాష యగుటకు సర్వ విధముల అర్హమనియు 'ఫ్రాన్స్' 'ఇంగ్లండు' మొదలగు దూరదేశములనుండి తెనుగు నేర్చిన విదేశీయులు అభిప్రాయపడుచుండ, మనమొక కంచెను కట్టుక గూర్చుని, మన భాషలోనికి కొన్ని ఆంగ్లపదములు రావచ్చుననియు, మరికొన్ని రాకూడదనియు—మన భాషాభి వృద్ధికి అనకట్టలు వేయుచుండుట విచిత్రముగాదా?

"లక్షలకొలది జనుల మనోవాంఛలను తన కవిత్వ ములో సువ్యక్తముచేసిన ఆ విపరీత ప్రతిభాశాలి యన్నాడు కదా—"

"ఉన్నచోటు చాలును మీకు
ఇంకా వెనక్కి పోతామంటారుకూడా
మీలో కొందరు—"

—వాకాటి సౌజన్య

## రామాయణకల్పవృక్షము

కేవలము దోషాలు చూపించుట విమర్శకాదని కొంద రంటారు. ఎందుకు కాదు? ఆ వ్రాసేవాడు వ్రాయవచ్చును కాని ఈ చూపించేవాడు చూపించకూడదా? కాని గుణ సూచనలో లేని బాధ ఈ దోషసూచనలో కొంత ఉన్నది. మనము గుణ మన్నది గుణము కాకపోతే పట్టించుకొనేవాడు లేడు. దోషమన్నది దోషము కాకపోతే పుట్టిమునిగినంత పనీ జరిగి తీరుతుంది. అందుచేత దోషైక దృక్త్వము అల్పులయెడ లాభించినంతగా అధికులయెడ లాభించదు. పైగా ఈ దోషచర్చ పండితులకు లాభించినంతగా పామరులకు లాభించదు. వారికి కొన్ని ఆయువు పట్టులు తెలియును. అంత కష్టమైన ఈ పనికి ఎవరికి మౌనము విభూషణమో వారు పూనుకొంటే తప్పుడు రాతలు తప్పవు.

ఇంతకీ దుర్గానంద్ అనేవారు రామాయణ కల్పవృక్షము మీద తమ విమర్శావ్యాసపరంపరలో మొదటి వ్యాసము స్రవంతిలో వ్రాసినారు.

ఈ విమర్శకు వీరొక దీర్ఘమైన ఉపోద్ఘాతమూ వ్రాసినారు. దానిలో కవి ఎటువంటివాడు కావాలో ప్రపంచించినారు. దానికొక దారీ తెన్నూ లేదు. కొన్ని ప్రసిద్ధములైన శబ్దాలు వాటికున్న అర్థములో ఆయన వాడలేదు. ఏ అర్థములో వాడినాడో తెలియదు. ఆ శబ్దాల అర్థాలు ఆయనకు తెలియవేమో అనిపించుతుంది. అందుచేత వాటివెంట బడిపోవుట అంటే హనుమంతుని తోకవెంట బడిపోయినట్లు. అదైనా సీత చీరదగ్గర ఆగుతుంది. కాని ఈయన సిద్ధాంతాలకూ నిర్వచనాలకూ పర్యవసానము చెప్పుట కష్టము.

'విశ్వనాథలో సత్యం ఉందా?' ఉందికాని అది చాలా ప్రాతదట. త్రికాలాబాధ్యమైనదే సత్యము. అదెప్పుడూ ఒక లాగే ఉంటుంది. ప్రాతబడదు. అట్లాగే 'శివం' 'సత్' 'జీవుడు' అన్నమాటలకు ఈయన విపరీతార్థకల్పన చేసినారు. ఆ అర్థాలు చూచి నవ్వవలెనో ఏడువవలెనో తెలియదు.

"ఈ యుగంలో ఉన్న లోక ధర్మాన్నే ఆయన పరిగ్రహించాలి" అని ఒక శాసనము. ఆలోకధర్మము పదార్థ పర్యవసాయి అనికూడా ఆయనే చెప్పుతున్నారు. దానిలోని నిజానిజాలు ఎట్లా ఉన్నా ఈ ధర్మనిర్ణయము చేసినదెవరు? లోకమనగా ఏలోకము? ప్రాచ్యమా పాశ్చాత్యమా? ఏలోకమునందైనను బహుసంఖ్యాకులు ఇప్పటికినీ ఆస్తికులు. కొంతమంది తమకుతామై గిరిగీసికొని ఇది లోక ధర్మ మనుకొన్నంత మాత్రాన కవియైనవాడు దానిని పరిగ్రహించవలసిందేనా? ఈ విమర్శకు డేలోకములో బ్రతుకుతున్నాడో తెలియదుగాని నేను బ్రతుకుతున్న లోకములో నూటికి తొంబదిమంది ఆస్తికులు. ఈ దృశ్య ప్రపంచానికన్న అతీతమైనది ఏదో ఉన్నదని విశ్వసించేవారు ఒకవేళ కారనుకొన్నా కవి తద్విపరీతుడగుటకు అర్హంకి ఉండవలసిన అవసరములేదు. మాంసభక్షకులూ సురాపాయులూ ఉన్న దేశములో జన్మించిన బెర్నార్డుషా శాకాహారి. సురాపాయికాడు. ప్రజల జీవనమార్గముకన్న కవి మార్గము ఇతరము కాకూడదన్నవానికి కవిత్వానికి సంబంధములేదు.

వీటికేమిగాని విమర్శకులు కొన్ని ఉదాహరణలు చూపించి అవి దోషాలనుకొనుటలో ఎంతగా పొరబడినారో చూపించుతాను.

"తనయుడన్న సూక్ష్మ తత్త్వం బెరుంగని జీవి మాయ లోన చిక్కుకున్న యనదపుర్వ్వి" అన్న వాక్య ముదాహరించి తనయుడు సూక్ష్మతత్త్వమని కవి వితండవాదం చేస్తున్నాడనీ వేదాంతులు ఈమాట ఒప్పుకోరనిన్నీ ఈయన ఆక్షేపించుతున్నాడు.

పైమాట దశరథుడు సుమంత్రునితో అన్నది. ఇక్కడ అద్వైత ప్రసక్తిలేదు. "ముదుపళ్ళ యందలి తిలోదక హారిని నన్ను జూడుమా, నామొగమందు వ్రేలెడిని నా పితృదేవతలాస్య దైన్యముల్" అని దుఃఖపడుతున్నవాడు దశరథుడు. "నాలుగు కంధులకా నడుమ నాటిన స్వీయ జయప్రభా పతాకాలలితంపు చాలనము" కూడ ఆయన గుండియకు సుఖము తేజాలదు. ఆ దశరథుడన్నమాట ఇది. ఇప్పట్లో ఆయనకు కొడుకుకన్న పరమార్థములేదు. తనయుడు సూక్ష్మతత్త్వ మగునాకాదా? అని ఇక్కడ విమర్శ పుట్టదు. విమర్శ పుట్టితే దశరథుడీమాట అనుట సమంజసమా కాదా అని పుట్టవలయును.

పోతే దశరథుడుకూడా వితండవాదన చేయలేదు. ఆ పద్యములో నిది ఒక అర్థాలంకారము. ఆ అలంకారమునట్లు దశరథుని మనః ప్రవృత్తి కనుగుణముగా వాడుట కవి మార్పు. ఆ అలంకారమేమిటో దాని లక్షణాలేమిటో దుర్గానంద్ ఎవరినైనా అడిగి తెలిసికోవలసినది.

రామాయణావతారికలో ఒక పద్యము, 'ఒకడు నాచన సోమన్న; ఉక్కుపుంఢు చెరపి పదిసార్లు తిరుగవ్రాసినను మొక్కవోని ఈ యాంధ్ర కవిలోక మూర్థమణుల' అని. పద్యము సరిగా చదువుకొనుటచేతకాక 'ఒకడు నాచన సోమన్న ఉక్కుపుంఢు' అని చదివి కోపము తెచ్చుకొన్నా డొక పెద్దమనిషి. ఈ విమర్శ అట్లాగే ఉన్నది.

'కాలినాథుల పద్యార్థము తెలియనిచో పాఠకునిది తెలియమి. ఈ నాథుల వ్రాసిన కవిదోషము' ఈ కవివాక్యము నిరర్థకము కావద్దని దుర్గానంద్‌గారి ఉబలాటము.

'ఒనర బోర్కాడించి యుయ్యెలతొట్టెలో పండబెట్టిన పసిపాపవోలె.... కాబిల్లి మేదినీశు నేత్రములకును చలువ పండించి పోసె' అన్న పద్యమును కాషువాకవి 'అగడపు మబ్బుకయ్యల' అను పద్యముతో పోల్చి మొదటి పద్యము రెండవదానికి లొచ్చు అని వీరు తేల్చినారు. కాషువా పద్యము యొక్క మంచి చెడ్డలలో నేను కల్పించుకోను. ఇక్కడ మాత్రము అటువంటి పద్యము వ్రాస్తే విశ్వనాథసత్యనారాయణ మరెవడో అగునుకాని విశ్వనాథ సత్యనారాయణ మాత్రము కాడు. ఆయన సహస్రనేత్రుడు. ఆ సహస్రనేత్రత్వమునకు గ్రంథము నిండా ఉదాహరణలే. ఈ పద్యముకూడా ఒక ఉదాహరణ. గ్రంథములో ఆ పద్యముయొక్క స్థానము గుర్తుంచుకోవలెను. అనేకుల వర్ణనకు కథకూ సంబంధ ముండదు. విమర్శకు డీ పద్యాని కి కథకూ ఉన్న సంబంధము చూడలేక సాధారణీకరణ లోపమని ఏమో వ్రాసినాడు. చంద్రవర్ణన లీ గ్రంథములో ఇంకా ఉన్నవి. ఈ ఒక్క పద్యములోనే చంద్రుడు రాజునకు శిశువువలె కనబడినాడు. సనత్కుమారుడు దశరథునకు పుత్రులు గలుగుదురని చెప్పిన కథను సుమంత్రుడు దశరథునితో చెప్పినాడు. 'అని మంత్రి విన్నవించినంత .... ఒనరబోర్కాడించి ....' ఇది వరుస. దశరథునికి తప్పకుండ కొడుకులు కలుగుదురని ఆవర్ణన చెప్పుతున్నది. పాఠకునికి రామాయణ కథతో ఉన్న పరిచితి ఆ స్థానములో ఆ పద్యము వ్రాయుటలోని అందమును తెలియ నిచ్చుటలేదు. ఆ అందము తెలియుటకు వెనుక ముందులు బాగుగా చూడవలయును. వర్ణనలకు కథతోడి సంబంధమును చూడవలయును. ఒకచోటి వర్ణలకు ఇంకొక చోటి వర్ణలకు భేదము చూడవలయును. ఈ భేదము ఉపమోత్ప్రేక్షాదులలోనే లేదు. భేదమేమిటో, అది ఎందుకున్నదో కళ్యాణ ఖండములోని ఋతువర్ణనలు చూస్తే తేలికగా తెలుస్తుంది. ఎక్కడ చూచినా తెలుస్తుంది. ఆ చోటే చెప్పుట ఎందుకంటే ఎక్కడనైనా చూచి తెలుసుకొనే సామర్థ్యముఅందరికీ ఉండదు కాబట్టి. అక్కడి వర్ణనలు దగ్గర దగ్గరగా ఉన్నవి. వెంటవెంట రాముని మనస్థితి చెప్పబడినది. అందుచేత అవి చూచి ఐనా అరము చేసికొంటారేమో అని.

చికిలి చుక్కలుగ నారి కెడంచె పూచెనా ?
చిన్నారిమావి పూచినది తాను
పాలంకలుగ పారిజాతమే పూచెనా ?
చిరుమల్లెతీవ పూచినది తాను

ఈ వసంతవర్ణన అవతార ఖండములోనిది. అది అట్లా ఎందుకున్నది ? ఇంకొకలాగా ఎందుకులేదు ?

తాను మాధవుడరుదెంచు దారియెల్ల
*నవవికాసంబు జంటి జంటలుగ బొలిచె*

అని చివర చరణము. జంటజంటలుగా పొలుచుట యెందులకు ? ఎందుకో అక్కడికథ చూస్తే తెలుస్తుంది. అర్థము చేసికొనే మార్గాలు ఎక్కడివక్కడే ఉన్నవి. ఆ మార్గములు తెలియనివారూ, తెలిసికొనుటకుప్రయత్నించనివారూ, తెలుసుకొనే ఓర్పులేనివారూ విమర్శలు వ్రాసే అవసరము లేదు.

"మరల నిదేల రామాయణం బన్నచో
ఈ ప్రపంచకమెల్ల నెల్లవేళ
తినుచున్న యన్నమే తినుచున్న దిన్నాళ్ళు
తన రుచి బ్రదుకులు తనవిగాన
చేసిన సంసారమే చేయుచున్నది
తనదైన యనుభూతి తనదిగాన
తలచిన రామునే తలచెద నేనును
నా భక్తి రచనలు నావిగాన.

కఠినపదాలు లేవుకనుక ఈ పద్యము అందరికీ అర్థమౌతుందనుకొనుట పొరపాటు. సాక్ష్యము దుర్గానందుగారే ఉన్నారు. "తిన్న అన్నము తిన్నట్లుగా ఉంది రామాయణసృష్టి" అని వారు గేలిచేసినారు. ఈ పద్యానికి అర్థమేమంటే జనులు సంసార లంపటులై యున్నంతకాలమూ రామకథాగానము యొక్క అవసరముండనే యున్నదని. రామకథను పునః పునః గానముచేసినవారెవ్వరూ ఇంత చక్కని సమాధానము చెప్పలేదు. ఈ యర్థ మెప్పుడో భారతిలో ధూళిపాళ శ్రీరామమూర్తిగారు చెప్పినట్లు గుర్తు. గట్టిగా చెప్పలేను. అదంతా అట్లా ఉంచి ఈయనకు ఉపమాన మంటే ఏమిటో తెలిసినట్లు లేదు. ఇక్కడ రామాయణానికి రోజూ తినే అన్నానికి పోలిక యట.

ఈ విమర్శకు సమాధానము వ్రాయుట నా ఉద్దేశ్యము కాదు. దాని వ్యర్థత్వము చూపించుటయే నా ఉద్దేశము. త్రవ్వినకొద్దీ విమర్శకుని అజ్ఞానమే బయటపడుతున్నది. దానికొక చివర అంటూ ఉన్నట్లు కనబడుటలేదు. అట్లా అనుటకు గూడ భయముగానే ఉన్నది. చివర లేదని అన్నావు గాబట్టి ఈ నా అజ్ఞానమేబ్రహ్మపదార్థమని ఆయన వాదిస్తాడేమో అని.

'చెలగి నీకును కీర్తి నార్జించునట్టి
ప్రతిభ లేదొక్క చక్కని బాటకలదు
శక్తిగలిగి యెవ్వడు ప్రతిష్ఠకును నెక్కు
వానితో నీవు పత్రికావైరమూను.'

—జువ్వాడి రామేశ్వరరావు

సెప్టెంబర్ జయంతి 'సాహిత్యధార' లో 'పాలిలక్స్వీ' ఉచ్చారణ తప్పు అని వ్రాశారు. దయచేసి మంచి నిఘంటువును దేనినైనా చూడండి. పా-పౌ లేక పలిలక్స్వీ అని అనవచ్చు.

అదే వ్యాసంలో క్విక్సాటు అనే మాట వాడారు. దీనిని స్పానిష్‌లో ఈవిధంగా ఉచ్చరించరు. సాంకోపాంజా అని కూడా అనరు. సాంచోపాంశా అని అంటారు.

మీరైనా కనీసం తెలిసిన మాటలే పడేట్టు చూడండి.

— డి. ప్రకాశరావు
మదరాసు.

(పాలిలక్స్వీ ఉచ్చారణ తప్పు అని వ్రాసిన దోషము సమవర్తిది కాదు. సంపాదక కార్యాలయములో జరిగిన పొరపాటు. శ్రీ సమవర్తికీ, పాఠకులకూ క్షమాపణ చెప్పుకొనుచున్నాము.

క్విక్సాటు, సాంకోపాంజా ఈ రెండు మాటలు సమవర్తిగారు వ్రాసినవి వ్రాసినట్లే ఉంచబడినవి. స్పానిష్ భాషలో ఆ శబ్దముల ఉచ్చారణ అది కాదని తెలిసినప్పటికీ మార్చవలసిన అవసరము కనబడలేదు. ఒక భాషాశబ్దములు ఇంకొక భాషలో పడి నలిగినప్పుడు ఉచ్చారణ మారకుండఉండుట అసంభవము. ఈ రెండు శబ్దములు ఇంగ్లీషు చదివినవారికిట్లే సుపరిచితములు. పరభాషా శబ్దముల ఉచ్చారణల యెడ మాకంత పట్టింపులేదు. ఆ శబ్దములు వివేచనలేకుండ వాడకూడదన్నంతవరకే సమవర్తిగారితో మాకేకాభిప్రాయము)

సం. జ.

'ఆకాశవాణి' ఇంతవరకు మా కార్యాలయమునకు చేరకపోవుటవలన ప్రకటింపజాలనందుకు చింతించుచున్నాము. దీనిని గురించి సామీరికి వ్రాయగా వారు 15 వ సెప్టెంబరుకే పోస్టుచేసియుంటిమని సమాధానము వ్రాసినారు.

సం. జ.

*

వ్యాసముల, వ్యాసకర్తల అకారాది సూచిక 13 వ సంచికలో ప్రకటింపబడును.

**PROCEEDINGS OF THE DIRECTOR OF PUBLIC INSTRUCTION, ANDHRA PRADESH.**

R. C. No. 973 M 4/58. Dated 8—6—59.

The following Telugu monthly is commended for use in all the Libraries of Schools, Colleges and public Libraries in the State.

Name: JAYANTI

K. RAGHAVA REDDY,
*For Director of Public Instruction.*

'జయంతి' రైల్వే స్టేషనులలోని 'హిగిన్‌బాథమ్స్' పుస్తకశాలలలో దొరుకును.

516, సుల్తాన్ బజార్, హైదరాబాదునుండి జువ్వాడి గౌతమరావుచే ప్రకటితము. ఫోన్ : 4616
అజంతా ప్రింటర్స్, సికింద్రాబాదు.